SREE VAGVALLI SERIES No. 7.

శ్రీ

రాధాకృష్ణ పరబ్రహ్మణేనమః

# రుక్మిణీపరిణయము.



ఇది-

శ్రీ చిల్కపాటి సీతాంబా

ప్రణీతము.

…మాన్ కొమాండూరు వేంకట రామానుజాచార్యులచేఁ

ప్రకటితము.

నెల్లూరు, ప్రభాతముద్రణాలయమున ముద్రితము.

సర్వస్వామ్య సంకలితము] ఆంగీరస-ఆశ్వయుజము. [వెల రు. 0—12—0.

II. No. 3.

# గ్రంథ ప్రశంస.

ఈ పద్మినీ పరిణయమును రచించిన చిల్కపాటి సీతాంబగారు నెల్లూరుజిల్లా కందుకూరుతాలూకా కల్కివాయి గ్రామంబునఁ బండిత శిఖామణు లైన ఉ. శ్రీమాన్ పర్ణశాల రాఘవాచార్యులకు నలమేలు మంగమ్మగార్లకు శార్వరి సం॥రం॥ ఆశ్వయుజ బ. ౧౧ గురువారమున జనించిరి. తండ్రి; పితామహి లక్ష్మమ్మ; బావగారును "విద్యారణ్య పంచానన" "విద్యావాచస్పతి" బిరుదాంచితులు ఉ॥ శ్రీమాన్ విక్రాల రామచంద్రాచార్యులు గారు. భర్త వీరలకడ క్రమంబుగ విద్యా గరిమం బడసిరి.

స్త్రీవిద్య యనుచితమను వారలకుఁ దలవంపులుగ నీకాలమున సారస్వతపీఠమలంకరించిన స్త్రీలు లేకను న్యూనతం బాప మున్ను రామాయణమును విరచించిన మొల్ల, రాధికా సాంత్వనమును రచించిన ముద్దుపళని, తెనుఁగు రాయని కూఁతురు మారీచీ పరిణయ రచయిత్రి మోహనాంగియు, వేంకటాచల మహాత్మ్యాది బహు ప్రబంధ ప్రణేత్రి తరిగొండ వేంగమాంబయు, తిరుపతి మహాత్మ్యాది గ్రంథరచయిత్రి కంచనపల్లి కనకమ్మ గార్లకు వెనుక వీరే యని విశదమగుచున్నది. ఇంకఁ గొందఱు నవలలు నాటకములు వ్రాసిన వారలుగలరు. వీరి ప్రబంధముకాక సముద్ర మథనమను నాటకమును గొన్ని నవలలును వ్రాసి మన [illegible] మండలమునకు మండనాయమానంబై యున్నారు. స్త్రీలు [illegible] మృదుమధురపద భూయిష్ఠమై [illegible] గర్భిత రసామృతంబుల నోలలాడించుచు దోహదప్రక్రియల విరాజిల్లు వీరిప్రబంధమే చాటుచున్నది!

ఇట్టి వైశద్యంబులఁ బుట్టిన యింటికిని మెట్టిన యింటికిని మనమండలమునకును వన్నెఁదెచ్చి గడుంగడు ముదమొదవించిన యీ వనితామతల్లికి నాయురారోగ్యైశ్వర్యంబు లొసంగ దయామయుఁడగు నీశ్వరు నిరతము

ఇట్లు,
కో. వేంకట రామానుజాచార్యులు.



శ్రీమాన్ కొమాండూరు వేంకట రామానుజా చార్యులుగారు.

శ్రీ

శ్రీ రాధాకృష్ణ పరబ్రహ్మణేనమః

# పద్మినీ పరిణయము.



శ్రీ మీఱన్ యమునావిహారము సతుల్ ♦
సేయంగ నీక్షించి తా
నామోదంబునఁ దత్పటంబులను వృ ♦
క్షాగ్రంబునం దాఁచ నా
రామల్ వందనమాచరింపఁ గని రా ♦
రండంచు గేల్సేయు నా
శ్రీమన్మంగళమూర్తి నాకుఁ గరుణన్ ♦
శ్రేయంబుల న్గూర్చుతన్. 1

ఉ. శ్రీపతి పెండ్లివేళన ధ ♦
రించిన కౌస్తుభరత్నమందుఁ దాఁ
జూపడ రాధయంచని య ♦
సూయవహించిన భీష్మపుత్రికిన్
గోపముఁబాపఁ దన్మణిని ♦
గోటఁ దొలంగఁగఁ జేయునట్టి యా

గోపకులైక భూషణుఁడు ♦
గోర్కెలొసంగుచు మమ్ముఁ బ్రోచుతన్. 2

చ. చెలువుగఁ బుస్తకంబు నొక ♦
చేత ధరించియు వీణె నొక్కచే
నలరఘటించి మేల్మి ధవ ♦
ళాంబరముల్ ధరియించి రత్నభూ
షల నలరించి విద్యలను ♦
సత్కరుణన్ గృపసేయు వాణినిన్
జలరుహగర్భురాణిని వె ♦
స న్మదినిల్పెద నిష్టసిద్ధికై. 3

తే-గీ. ఆదికవియైన వాల్మీకి ♦ నాత్మఁ దలఁచి
వ్యాసుఁ గొనియాడి కవి కాళి♦దాసు నెంచి
భారవిని మాఘు బాణుని ♦ బ్రస్తుతించి
సరవి భవభూతి భోజుల♦ సన్నుతింతు. 4

ఉ. నన్నయభట్టు తిక్కకవి♦
నాథుని నెఱ్ఱన పోతనార్యుఁ బే
ర్కెన్నికఁగన్న భాస్కర క♦
వీంద్రుని సింగన రంగనాథుఁ బె
ద్దన్నను ధూర్జటి న్బుధు న♦
ధర్వణుఁ దిమ్మన సోమనాధునిన్

సన్నుతిఁజేతు నెప్డు బుధ♦
సత్కవుల స్మదిఁగావ్యసిద్ధికై. 5

తే-గీ. కవితలక్షణమెట్టిదో♦ కానరట్టి
యబల వ్రాసినపాత్రమి ♦ య్యదియటంచుఁ
బరిహసింపక నీర్వోర్చి ♦ పాలుగ్రోల్
నంచగతియొప్పులనె మీర ♦ లరయరయ్య. 6

సీ. గురుతర కౌండిన్య ♦ గోత్రపవిత్రుఁడౌ
నారసింహార్యుఁ డే ♦ ధీరుతండ్రి
అమితాన్నదాన వ్ర ♦ తాసక్తయై ఖ్యాతిఁ
గనిన లక్ష్మమ్మ యే ♦ యనఘుజనని
పతిపాదభక్తిత ♦ త్పరత సాధ్వియనంగ
దగుమంగమాంబ యే ♦ ధన్యదేవి
విద్యాటవీ సింహ ♦ బిరుదాంక రామచం
ద్రార్యుఁ డేసుజనున ♦ కల్లుఁడయ్యె

తే-గీ. దయయు దానంబు శాంత మే ♦ ధన్యనిలయ
మట్టి శ్రీపర్ణశాల వం ♦ శాబ్ధి చంద్రుఁ
డైన మజ్జనకుని రాఘ ♦ వార్యునకును
భక్తిఁ బ్రణమిల్లి యేవేళఁ ♦ బ్రస్తుతింతు. 7

క. భారద్వాజాన్వయ వి
స్తారుఁ హరిభక్తినిరతు ♦ సన్నుతశీలుఁ

కోరిక మన్మాతామహు
నారయ వినుతింతుఁ దిరుమ ♦ లార్యుల నెపుడున్. 8

తే-గీ. బ్రహ్మవైవర్తకల్కిపు ♦ రాణమాది
గ్రంథముల శ్రీశు కర్పించి ♦ ఘనతగనిన
యట్టి వేంకటరామాను ♦ జార్య నాదు
మాతులుని భక్తి నెంతు నె ♦ మ్మనమునందు. 9

సీ. కవివర్యుఁడై పెక్క ♦ గ్రంథంబు లొనరించి
పేరొందె నేఘను ♦ పెద్దతండ్రి
అఖిలనాటకలక్ష ♦ ణాదులఁ బరికించి
ఖ్యాతిఁగన్గొనె నేరి ♦ కన్నతండ్రి
ఎలప్రాయమున శాస్త్ర ♦ ములనేర్చి బుధులలో
వన్నెఁగన్గొనె నేరి ♦ పిన్నతండ్రి
పుణ్యకాంతలనెల్లఁ ♦ బూజ్యయౌ లక్ష్మన
రసమాంబ యెట్టి స ♦ ద్వ్రతుని జనని

తే-గీ. వినయ విద్యాభిమాన స ♦ ద్వినుత యశుఁడు
నవని శ్రీ చిల్కపాటి వం ♦ శాబ్ధిసోముఁ
డైన వేంకట నారసిం ♦ హార్య నాదు
ప్రాణవిభు పాదపద్మముల్ ♦ భక్తిఁగొలుతు. 10

తే-గీ. మహితమైనట్టి హరిభక్తి ♦ మదిని నిల్పి
సింగరాద్రి నృసింహుని ♦ సేవఁజేసి

ధన్యతనుగాంచు మాతల్లి ♦ తల్లియైన
శ్రీ పెరుందేవి ననుఁ గృప ♦ సేయుఁ గాక! 11

తే-గీ. సరవి శ్రీభాష్య భగవద్వి ♦ షయము లెపుడు
భక్తిసేవించు ద్రవిడప్ర ♦ బంధవేత్త
భవ్యచరితుండు విక్రాల ♦ భాష్యకార్య
నస్మదాచార్యపదముల ♦ నాత్మఁదలఁతు. 12

తే-గీ. అవని కౌండిన్యగోత్ర వి ♦ ఖ్యాతు రాఘ
వార్యునకు మంగమాంబకు ♦ నాత్మజాత
అనఘు వేంకటనారసిం ♦ హార్యుపత్ని
వసుధ సీతాంబ యనుపేర ♦ వరలుదాన. 13

క. సుకవీంద్రులకు సమస్కృతిఁ
బ్రకటితముగఁజేసి యఖిల ♦ పండితులకుఁ గేల్
ముకుళించి శ్రీ రమాపతి
కకలంకముగాఁగ దీని ♦ నర్పణసేతున్. 14

సీ. ప్రథిత వేంకటగిరి ♦ ప్రభు కళాశాలాంధ్ర
పండితుండయి కీర్తిఁ ♦ బడసి సింహ
పురవరమందునఁ ♦ బొలుచు శ్రీవాగ్వల్లి
పత్రికాధిపుఁడు వి ♦ ద్వత్ప్రియుండు
'అలతల్పగిరిమహిం ♦ మా' దిప్రబంధముల్
విరచించి ప్రఖ్యాతి ♦ వెలయుచుండు

విద్వత్ప్రో-మాండూరు ♦ వేంకటరామాను
జాచార్య వర్యుల ♦ నధికప్రీతి
తే-గీ. నారచిత పద్మినీ పరి ♦ ణయము శంఖ
మందు తీర్థంబు పగిది యో ♦ గ్యంబుగాఁగఁ
జేసి వాగ్వల్లిమాలను ♦ జేర్చ నేను
వందన శతంబులను సమ ♦ ర్పణముసేతు. 15

షష్ఠ్యంతములు.

క. వసుదేవనందనునకున్
వసుధాపరిపాలునకును ♦ వసుచేలునకున్
అసదృశ విక్రమునకుఁ దా
పసమందారునకు భక్త ♦ పరతంత్రునకున్. 16

క. నవనీతాహారునకున్
రవిశశినేత్రునకు సుజన ♦ రంజకునకు వా
సవనుతున కతులబలునకు
భువనాధీశునకు హరికిఁ ♦ బూతాత్మునకున్. 17

క. ముర కంస నరక దానవ
హరునకు మునిహృదయపంక ♦ జావాసునకున్
కరుణారసహృదయునకు
స్మరమోదారునకు భక్త ♦ పరిపాలునకున్. 18

క. నీరద నిభదేహునకు
న్వారిజదళలోచనునకు ♦ వల్లవయువతీ

జారునకు నందగోపకు
మారునకు స్మరసమునకు ♦ మణిహారునకున్. 19

క. కుండలయుగమండిత మృదు
గండస్థలునకును విమత ♦ గర్వహారునకున్
అండజవాహానునకు నా
ఖండలనుతునకును ద్వారక ♦ కా వాసునకున్. 20

క. గోపకుల మండనునకున్
శ్రీపతికి న్దుష్టదనుజ ♦ శిక్షితునకు దీ
నాపన్నివారణునకు
న్గోపీనాథునకు మదన ♦ గోపాలునకున్. 21

వ. అంకితంబుగా నాయొనర్పంబూనిన పద్మినీ పరిణయంబను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన:— 22

శా. శ్రీ కంజాక్షినివాసమై శుభదమై ♦
శృంగారపుంబోఁవునై
నాకంబు న్నిరసించు శోభఁగలదై ♦
నానాసుఖవ్రాతమై
శ్రీకల్యాణయుతంబునై చెలువమై ♦
శ్రీనాథసంప్రీతమై
పీఁకన్ శోభవతీపురంబలరు ను ♦
ర్వీమధ్య భాగంబునన్. 23

పురవర్ణన.

ఉ. సుందరమౌ వనంబులును ♦
జూడ భయంకరమౌ నగడ్త లిం
దిందిరవాసమై యలరు ♦
దివ్యసరోవరముల్ మహోముదం
బొందఁగఁ జేయుధేనువులు ♦
హస్తికదంబము సైంధవంబులున్
పొందగఁగల్గి యెల్లరకు ♦
మోదముఁగూర్చెడు నప్పురం బిలన్. 24

క. పరగఁగ నాపురికాంతలు
సరసిజమిత్రునకుఁ బూజ ♦ సల్పెడుమది సుం
దరహర్మ్యతలములందున
సరవినిలచి యతనిఁ బూజ ♦ సల్పుదు రెలమిన్. 25

చ. ఘనమగు వేదపాఠముల ♦
కావ్యములు న్ద్రవిడప్రబంధముల్
పనసలు గీతభాష్యములు ♦
భాగవతంబులు భారతంబులున్
దనరగ జ్యోతిషంబులును ♦
దర్కములు న్గణితాదిశాస్త్రముల్
ఘనతఁ బఠింతు రప్పురిని ♦
గల్గిన భూసుర జాలమంతయున్. 26

మ. హరినైన న్భయమందఁ జేయుదురు ధ ♦ ర్మాసక్తులై యందఱున్
హరినైన న్దలపట్టి యీడ్చెదరు బా ♦ హాటోప గర్వంబునన్
హరినైనన్ హసియింపఁ జాలుదురు లో ♦ కామోదులై యందఱా
పురమందుండు నృపాలవంశతిలకుల్ ♦ భూపాలనాసక్తులై. 27

ఉ. అందఱు బుద్ధియందున బృ ♦ హస్పతు లందఱు వైభవేంద్రు లం
దందఱు బాహువిక్రములు ♦ నందుఁ గుమారు లుదారబుద్ధు లం
దందఱు కల్పభూజములు ♦ నై యట రాజకుమారులెల్లరున్
పొందుగఁ గల్గి నాకమును ♦ బోల్పఁగ నప్పురిశోభఁబుంధరన్. 28

క. పరగఁగ ధనదుఁడు దనకు
న్సరిపోలఁడటంచు ద్రవ్య ♦ సముదాయములన్
గరువమున నుందురప్పుర
వరమందుననుండు వైశ్య ♦ వరులెల్లపుడున్. 29

క. హాలముఖ సంపదచేతన్
దొలిబిక్షుని బీదతనముఁ ♦ దోలి విభూతిన్
గలుగఁగఁ జేయంజాలిన
బలయుతులై శూద్రవరులు ♦ బరగుదు రచటన్. 30

సీ. తమనాట్యకౌశల ♦ క్రమములనీక్షించి
పరగ మూర్ఛపడి రంభ ♦ కరముగుంద
తమరూప గాంభీర్య ♦ తకుసిగ్గు నొందుచు
ఊర్వసి చేలలో ♦ నురువసింప
తమగాన మాధుర్య ♦ మమరంగనీక్షించి
మేనక తపసుల ♦ లోననుండఁ
దమవీక్షణాంబుల ♦ రమణీయతను గాంచి
హారిణి సిగ్గునఁ బూరిఁ ♦ గఱచుచుండఁ

తే-గీ. దమవిలాసంబులెన్నఁగఁ ♦ దలఁపుఁ గలిగి
యలఫణీంద్రుఁడు వేయినా ♦ ల్కలుధరింపఁ
బ్రోడలైయుండు వేశ్యపూ ♦ బోఁడులెపుడు
వరలుచుండుదు రప్సర ♦ వరమునందు. 31

పుష్పలావికా వర్ణనము.

సీ. మగువనీదండకుఁ ♦ దగువెలఁదెల్పుము
వెలఁదెల్ప నీయ నీ ♦ కలవియగునె
గోరంటనిత్తువా ♦ నాకీశిరోమణి
రసికుండవే దాని ♦ పసమెఱుంగ

మొగ్గలంటఁగ రాదె ♦ మూసిపెట్టెద వేల
బోణిసేయక ముట్టఁ ♦ బోలునో కో-
లికుచంబు లిత్తువా ♦ వికసితోత్పలనేత్రి
పైకమ్ము బాప కే ♦ పగిదినిత్తు
కానఁగారాదె బం ♦ గారమా విరిబంతు
లవి కాంచనలతో ద ♦ యములు గావె

తే-గీ. యనుచు నీరీతి యువజను ♦ లాడునట్టి
వాక్యములకెల్ల సముచిత ♦ భంగి నుత్త
రమ్ములిచ్చుచుఁ బూలమ్మ కొమ్మ గములు
దిరుగుచుండుదు రప్పుర ♦ వరమునందు. 32

తే-గీ. అప్పురశ్రేష్ఠమందున ♦ నతిబలుండు
ధర్మనిరతుఁడు రిపుబల ♦ మర్మభేది
రత్నగర్భుండునాఁ బడు ♦ రాజవరుఁడు
పాలనముసేయుచుండె భూ ♦ ప్రజలుమెచ్చ. 33

ఉ. సుందరతన్మనోభవుని ♦
సూనృతవాక్యమునన్ యుధిష్ఠిరుం
బొందుగ నేకదారవ్రత ♦
పోషణమందున రామచంద్రునిన్
గ్రిందుగ దానమందు శిబి ♦
కర్ణుల శౌర్యమునందుఁ బార్వతీ

నందనుఁ బోలునాతఁడు న ♦
నంతమునేలెఁ డనంతకీర్తితోఁ. 34

సీ. పరగంగఁ దనప్రతా ♦ పమునకోర్వఁగలేక
భయమున రిపులు క ♦ ప్పములొసంగఁ
బరదేశములనుండు ♦ ధరణీశులందఱు
సఖ్యంబుఁ దనతోడ ♦ సల్పుచుండఁ
బ్రజలెల్లఁ దండ్రిగా ♦ భావించి యెప్పుడు
తనయాజ్ఞలన్ని యౌ ♦ దల వహింపఁ
జననాథవంశాబ్ధి ♦ చంద్రుఁ డీతండని
బందుగు ల్వేనోళ్లఁ ♦ బ్రస్తుతింప

తే-గీ. గౌతమీదేవి యనియెడు ♦ కాంత దనకుఁ
గూర్మిపట్టంపుదేవియై ♦ కూడియుండ
సకలసౌఖ్యంబులందుచు ♦ సంతసమున
రాజ్యమేలుచు నుండె నా ♦ రాజవిభుఁడు॥ 35

వ. ఇవ్విధమున నవ్వసుమతీవల్లభుండు సకలజన మనోరంజకంబుగా రాజ్యంబుసేయుచు సంతానంబులేని చింతయొక్కటి తనమనంబున బాధింప బహుళపక్ష క్షపాకరుని చందంబున క్షీణించుచుండ నొక్కనాఁడు.

సీ. తొగరుమెంజడలు కెం ♦ జిగురుకాంతులునీన 36
రహిమీఱ నూర్ధ్వపుం ♦ డ్రంబు మెఱయఁ

సురమందుఁ బటికంపు ♦ సరులుకాంతులనీనఁ
జేతను వీణియ ♦ చెలఁగుచుండఁ
దనమేనికాంతులు ♦ దవిలి దిక్కులనెల్లఁ
బండువెన్నెలకాంతి ♦ నొందుకొనఁగ॥
మాటికి శ్రీకృష్ణ! మాధవా యనియెడు
కీర్తినల్ సెవులఁ జొ ♦ క్కింపుచుండ

తే-గీ. సరవి నాకసముననుండి ♦ ధరణి తెఱవుఁ
బట్టివచ్చుచునుండ భూ ♦ ప్రజలు దన్ను
గరము నబ్బురమందుచుఁ ♦ గాంచుచుండ
వచ్చె సురమౌని యా ధరా ♦ వరునిసభకు. 37

క. వచ్చిన సంయమివరుని
న్నెచ్చరఁ బూజించి యతని ♦ చే దీవనలన్
మచ్చిగఁ గైకొని వినయం
బచ్చుపడ న్నిలచునృపున ♦ కతఁడిట్లనియెన్. 38

చ. నరవర సేమమే ప్రజలు ♦
సమ్రీతఁ దాల్తురే నీదునాజ్ఞలన్
కరులు, హయంబులు న్మొదలు ♦
గాఁగలవాటికి మేలె, నీదు సుం
దరుల కనామయంబె మది ♦
దారుణదుఃఖము గల్గినట్టులన్

గరము కృశించియుండె దవు ♦
కారణమెద్ది వచింపు? నావుడున్. 39

ఆ-వె. మానిచంద్ర నీకు ♦ మఱికిఁదెలియనట్టి
దీజగంబులోన ♦ నేది గలదు?
అయిన విన్నవింతు ♦ నవధరింపుము నాదు
మనమునందుఁ గల్గు ♦ ఘనభరంబు. 40

చ. మునికులనాథ! నందనుల ♦
ముద్దుమొగంబులఁ గాంచనైతి నా
జననము వ్యర్థమయ్యె మును ♦
సల్పినపుణ్యములన్ని వమ్ములై
జనియెను వార్ధకంబాదనె ♦
జవ్వనము న్విడిపోవసాగె నో
యనఘచరిత్ర! యందుల క ♦
హర్నిశముల్ మదిలోనఁ గుందెదన్. 42

ఆ-వె. రాజవరులు మున్ను ♦ రహితమై వంశంబు
లంతమొందుచుండ ♦ నపుడు మిమ్ము
వంటిపుణ్యనిధుల ♦ వాత్సల్యమునఁ బుత్ర
వంతులైరిగారె! ♦ వసుధలోన. 42

వ. కావున నోమునిచంద్ర! నాకు నేదేని యొక్కయుపాయంబున సంతానంబు గలుగునట్లు లనుగ్రహింపవే యనుఁడు, నమ్మౌని యొక్కింతతడవు నిమీలితనేత్రుఁడై మరల రాజు నవలోకించి యిట్లనియె:—

క. జననాథ నీకుఁ బుత్రిలు
జనియించుట దుర్లభంబు ♦ సమ్మతిఁ దులసీ
ఘనవ్రతము సేయ దానన్
గనియెదవొకసుతను ముదము ♦ గడలుకొనంగన్. 45

సీ. ప్రొద్దునదంపతు ♦ లిద్దరు మేల్కాంచి
కాలకృత్యంబుల ♦ నోలిఁదీర్చి
తులసివేదికలన్ని ♦ చెలువుగాఁ గస్తూరి
సలిలంబుచేతను ♦ గలయ నలికి
ముత్యాలముగ్గులు ♦ ముదయముతోడనమర్చి
యావాహనముదేవి ♦ నమరఁజేసి
యేపుమీఱఁగ షోడ ♦ శోపచారంబుల
గావించి యతిభక్తిఁ ♦ గరయుగములు

తే-గీ. ఫాలతలమునఁ గీలించి ♦ ప్రణతులగుచు
నిందిరా! లోకపావని! ♦ బృంద మమ్ము
కరుణతోడుత నేవేళఁ ♦ గావుమనుచు
సన్నుతులఁ జేతురెప్పుడు ♦ సతియుఁ బతియు. 46

వ. అట్లు తదేకనిష్ఠాగరిష్ఠులై యాఱుమాసంబులు వ్రతంబు సేయ నొక్కనాఁడు. 47

సీ. గిలుకుమెట్టెలు వేళ్ళ ♦ ఘలుఘల్లుమనుమ్రోయ
పదముల నందియ ♦ ల్గదలుచుండ

కటితటంబున రత్న ♦ కాంచీరవంబొప్ప
కరకంకణంబులు ♦ ఘల్లనంగ
ఉరమున రతనంపు ♦ సరులు కాంతులు నీన
కర్ణకుండలములు ♦ గదలుచుండ
నాసికాగ్రంబున ♦ నవమౌక్తికంబొప్ప
తిలకంబు మోమునఁ ♦ జెలువుగులుక

తే-గీ. నీలశైవాలమనఁజాలు ♦ కీలుజడను
బారుజాతసుమంబులు ♦ పరిమళింప
మేలుసరిగంచు జాళువా ♦ మిసిమివలువ
సొంపుగులుకంగ ధరియించి ♦ సోయగమున. 48

తే-గీ. ఒకకరంబున రాచిల్క ♦ యొప్పలీన
నభయమీయంగ నొకచేయి ♦ యమరఁజాచి
తులసివెల్వడి యేతెంచు ♦ చెలువఁ గాంచి
యబ్బురంబంది దంపతు ♦ లధికభక్తి. 49

వ. సాష్టాంగ దండప్రణామం బులాచరించి నిటలతటఘటి
తాంజలిపుటులై. 50

చ. వననిధియందు బుట్టి యట ♦
వాసవబ్రహ్మాదినేశరుద్రులం
గనుఁగొని వారిచిత్తమునఁ ♦
గైకొననొల్లక సర్వలోకపా

వనుఁడగు శౌరికంఠమున ♦ వారిజదామమునుంచి ప్రేముడిన్
గనుభవదీయనేత్రములఁ ♦ గాంచుమమున్ గృపఁ గరమాసతీ
ఉ. భీమ శరాసనంబు భుజ ♦ వీర్యముమీఱఁగ నెక్కు వెట్టి శ్రీ
రాముఁడు దున్చిన జ్జనక♦ రాజు ముదంబునఁ బెండ్లి సేయ శ్రీ
రామునిశీర్షమందు మది ♦ రంజిలఁగాఁ దలఁబ్రాలువోయు నీ
కోమలహస్తమెత్తి మదిఁ ♦ గోర్కులొసంగుము మాకు భార్గవీ.
చ. అరి నికరంబులం గెలిచి ♦ యావసుదేవసుతుండు ప్రేమ ని
న్బరిణయమాడి నీపదముఁ ♦ బట్టుచు సప్తపదంబుఁ ద్రొక్కఁగా
జరిపెడువేళ సిగ్గునను ♦ సంకుచితం బగుచుండునట్టి నీ
చరణయుగంబు సత్కరుణ ♦ సాధిలఁజేయుత మాకభీష్టముల్.
క. అనియీరీతిన సన్నుతు 53
లొనరించు నరేంద్రుఁగాంచి ♦ యొయ్యనఁ దులసీ
వనజాతనేత్రి యిట్లను
ఘనమగు సత్కరుణమదిని ♦ గడలుకొనంగన్. 54
వ. రాజేంద్రా! మీభక్తికిమెచ్చితి నను బోలిన యొక
పుత్రికా రత్నంబుగలిగి భవదీయంబగు వంశంబు నుద్ధరించు
ననియద్దేవి యంతర్ధానంబు నొందిన నచిరకాలంబున నా రాచ
దంపతులకుఁ బూర్వపుణ్యవశంబున దేవ తానుగ్రహమును
రూపుఁదాల్చెనోయన నారాజపత్ని గర్భంబుఁ దాల్చె 55.
చ. కమలసరోవరంబునను ♦ గౌతుక మొప్పఁగ నుద్భవించు శ్రీ
రమణి తెఱంగున న్సుగుణ ♦ రాశి యనందగునట్టి యాధరా
రమణునిదేవి గర్భమున ♦ రాజితకాంతిఁ జనించె సౌర శ్రీ

రమణిమొయుము నెల్లరు క♦ రంబు ముదంబున సన్నుతింపఁగన్

క. శ్రీకాంత రూపమై తగు 56
నాకాంతామణికిఁ బద్మ ♦ యనునామం బా
భూకాంతుఁ డిడి ముదంబునఁ
జేకొని పోషించుచుండెఁ ♦ జెలువము మీఱన్. 57

తే-గీ. మించులనుమించు నెమ్మేని ♦ మించుదనర
చిలుకపలుకుల నలరించు ♦ పలుకు లలర
నెలమి రాయంచపిండుల ♦ గెలుచునడలు
గలిగి యాబాల బాలలీ ♦ లలఁ జెలంగె. 58

క. చెలువున మణియుదయించిన
కరణి న్బంగారమునకు ♦ ఘనమగుతావుల్
బొరసిన చందంబున నా
తరుణికి జవ్వనము మేనఁ ♦ దద్దయుఁబొడమెన్. 59

సీ. ఘన కృష్ణవిభవంబుఁ ♦ గనె నాతిపెంజడ
విధునిచందముఁ బూనె ♦ వెలఁది మోము
మీనాకృతి వహించె ♦ మానిని కందోయి
మాధవాకృతిఁ బూనె ♦ మగువ మోవి
గళము శంఖముభాతిఁ ♦ గనుపట్టె నింతికి
అచ్యుతస్థితిఁ బూనె ♦ నతివ చనులు
కలను లేదనుమాడ్కిఁ ♦ గల్కిమధ్యంబొప్పె
కటి రథాంగస్ఫూర్తిఁ ♦ గాంతకాంచె

తే-గీ. తరుణిపదములు కూర్మంబు ♦ కరణి మెలసె
కాంచనాంబర మన నొప్పెఁ ♦ గాంత మేను
నిటుల శ్రీవిష్ణు చందంబు ♦ లెన్నియేని
గలిగి జగములు వినుతింప ♦ నలరుచుండె. 60

తే-గీ. కావ్యనాటకములయందుఁ ♦ గణనకెక్క-
మహి నలంకారశాస్త్రంబు ♦ రహి నెఱింగె
సరసకవితను భారతి ♦ సరణి నొప్పి
యెల్లవిద్యలఁ బ్రోడయై ♦ యుల్లసిల్లె. 61

మత్త. శ్రీసతీహృదయేశ! సన్ముని ♦ చిత్తసారస భృంగ! శ్రీ
వాస! కాంచనచేల! నారద ♦ వంద్యపాద! మహీధరా
వాసవానుజ! దీనపోషక ♦ వారణార్తిహరా! చ్యుతా
దాసరక్షక! దైత్యశిక్షక! ♦ ధర్మరక్షణ దీక్షితా. 62

గద్య:—ఇది శ్రీమదనగోపాల వరప్రసాదిత సరసకవితాశోభి
త శ్రీమద్భాష్యకారాచార్య కరుణాకటాక్ష లబ్ధ పంచసం
స్కారపవిత్రిత శ్రీమత్పూర్ణశాలవంశపయః పారావారరా
కాసుధాకరకౌండిన్యసగోత్రపవిత్ర శ్రీరాఘవార్యా
పత్య అలమేలుమంగాగర్భజనిత శ్రీచిల్కపాటి
సీతాంబా ప్రణీతంబగు పద్మినీపరిణయంబు
ప్రథమాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

# పద్మినీపరిణయము

## ద్వితీయాశ్వాసము.



క. శ్రీరాధా హృదయేశ్వర
వారిజభవజనక లోక ♦ వందిత మురసం
హార భవదూర శ్రీవర
నారదసంగీతలోల ♦ నందకుమారా. 1

వ. అవధరింపుము తదనంతరంబ రత్నగర్భుండు మహాలక్ష్మి స్వరూపిణియగు కుమారికం గాంచి యపారంబగు నానందాంబుధి నోలలాడుచుండె నంత. 2

చ. నరవరుఁడొక్కనాఁడు నృప ♦ నందనులున్ సుహృదాది వర్గముల్। గరమనురక్తితోఁ గొలువఁ ♦ గౌతుక మొప్పఁగ నిండుకొలువ్వున్। వరలుచునుండి యాధరణి ♦ వల్లభుఁడిట్లని పల్కె నీధరా।వరనికరంబులో నెవనివాసియటంచుఁదలంతురెల్లరున్. 3

తే-గీ. అనుచు నారాజశేఖరుం ♦ డానతీయ
నతని సచివుండు మతిమంతుఁ ♦ డనఁగఁబరగు
విమల గుణశాలి నీతికో ♦ విదుఁడు పల్కె
వన్నెమీరఁగ నాధరా ♦ వరునితోడ.

సీ. నరనాథ విను ధరా ♦ వరకోటిలోనెల్లఁ జేది
మిగుల నుతింపఁగాఁ ♦ దగినవాఁడు
అమరావతీ పట్ట ♦ ణాధినాథుఁడు శూర
సేనుండు నాఁబడు ♦ మానధనుఁడు
వైరిభీకరుఁ డని ♦ వార్యసాహసుఁ డార్త
జనవత్సలుఁడు ధీ ♦ జననుతుండు
సకలాగమాది శా ♦ స్త్రములెఱింగినవాఁడు
ధీరుఁడు శాంతుఁ డు ♦ దారగుణుఁడు
తే-గీ. అఖిలదిశలను దనయశ ♦ మలమికొనఁగ
ధరణిప్రజలెల్లఁ దండ్రిగాఁ ♦ దలఁచుచుండ
అన్నిటను మిమ్ములనుబోలి ♦ యున్నవాఁడు
రాజమార్తాండ! యాధరా ♦ రమణుఁడచట 5

చ. నరవర యాధరావిభుని ♦ నందనుఁ డా సురరాజసూతికిన్
దరమగువాఁడు రూపమునఁ ♦ దద్దయుఁ దద్గుణశౌర్యసంపదన్
వరలుచుమాధవాఖ్యఁగని ♦ వాసియువన్నెయుఁగల్గియీభువి
స్థిరముగ యౌవరాజ్యమున ♦ నిల్చెజగంబులు సంతసింపఁగన్

వ. ఇట్లు మతిమంతుండు మహారాజచంద్రుని సభాముఖంబున శూరసేన సుతుండగుమాధవుని రూపగాంభీర్య శౌర్యౌదార్యాది గుణంబు లుగ్గడించి చెప్పుచున్నయెడ. 7

ఉ. అంతకుమున్నరాజసుత ♦ యాసభపార్శ్వ గృహాంతరంబున
న్సంతసమొప్పఁగాఁ దనదు ♦ సంగడికత్తెలు గొల్వ నుండి ధీ

మంతుఁడు మంత్రిపల్కులను ♦ మాటికిమించు మరంబుమాధవా
కాంతముగాఁగ నాధరణి ♦ కాంతుతనూజ మనోజవేదనన్. 8
ఉ. అచ్చటినుండి యారాజులరు ♦ హాయతలోచన యంతిసీనుకున్
జెచ్చెరవచ్చి చెక్కునను ♦ జేయి నమర్చి కరంబు చింతతోఁ
బచ్చని తుంటవింటిదొర ♦ బారికి నోర్వని చిత్తవృత్తితో
హెచ్చగుతాపసహ్నిశిఖి ♦ నేరుచునీగతి వెచ్చనూర్చుచున్ 9
ఉ. అక్కట నెచ్చెలుల్ గొలువ ♦ నంతిపురిశ్వసింయింపలేక యీ
చక్కనిగొల్వుఁగాంచుమదిఁ ♦ జయ్యన నచ్చటికేగ నేల నా
రక్కడశూరసేనసుతు ♦ నాడటఁ జేరొక్కనుచుండ నేల నా
కక్కట యాకుమారకుని ♦ యందమునం బిడుచేల దైవమా 10

క. ఈవల కెన్నడెఱుఁగని
భావం బుదయించె మదికిఁ ♦ బలుతెఱఁగులనా
భూవరు నందనుఁగాంచఁగ
నేవిధిసమకూరు దాని ♦ కెవ్వరొ ఘటకుల్ 11

తే.గీ. అనుచు నారాజ నందను ♦ నతివతలఁచి
కరముచింతిలుచుండుటఁ ♦ గాంచి యామె
సఖి కళావతి యిట్లను ♦ సరస యుక్త
వచనరచనా చమత్కృతి ♦ వన్నెగుల్క- 12

మ. చెలిమాయాగతివిన్నసౌమొగముతోఁ ♦ జెల్వంబుఁబోనాడి
యే! చెలులంజీరక ముద్దురాచిలుకకుం జెన్నొందఁగాఁ గ్రపుం
బలుకుల్ సెప్పక వీణెమీటక యిటుల్ ♦ భావంబునం గుందుచున్

కలికీ దాచెదవేల నాయెడల రా ♦ కా చంద్రబింబాననా 13

చ. తలిరులబోడి తల్లికిని ♦ దండ్రికిమించిన యాప్తబంధుగుల్
చెలులనుచుందలంపు మది ♦ చెప్పెద నొక్కటి తల్లిదండ్రులున్
వలఁప రొకొక్కకార్యములఁ ♦ దామరసాక్షిరొ యట్టివేళలన్
జెలులెభరంబుఁబూని యది ♦ చేసురఁజేతు రసారధైర్యలై 14

క. నెరవేర్చెదనీకోర్కిని
తరుణీ నాప్రాణమైనఁ ♦ దగనిచ్చెద నో
సరసిజలోచన మోదము
పొరయఁగ నెలవియ్యనమ్మ ♦ పుత్తడిబొమ్మా 15

వ. అనియీవిధంబునఁదనప్రాణపదంబగుకళావతిననునయిం
చియడుగుటయునాకాంత కొంతవంతంబాసిప్రియసఖింగని.

మ. చెలియా నీయెడదాఁచనేల ♦ నయినం జెప్పంగనోరాడ దీ
చెలులెల్లన్విన గేలిచేయుదురు నా ♦ చేతల్వినం దండ్రి యా
నలఁ గోపించు నటంచు భీతిలెదు నా ♦ ప్రాణంబవౌ నీయెడన్
గలదే వేఱుతలంపు స్వప్నముననైనం ♦ గాంచఁగానెచ్చెలీ 17

ఉ. నిన్నసభంగనుంగొనఁగ ♦ నీవును నేనునుదోటినెచ్చెలుల్
జన్న నమాత్యుఁడోలి సర ♦ సత్వముగానొకరాజ పుత్రు పల్
పన్నెలఁ జెల్పుచుండ విని ♦ వానిపయిం దగులొందిఏడి శా
కున్నదినామనంబు విధి ♦ యోగమెఱుఁగఁగరాదు నెచ్చెలీ 18

క. జననీజనకులొసంగిన
జననాథుని బెండ్లియాడఁ ♦ జనుఁ గన్నెలకం

చని చిత్తమందుఁదలఁచిన
మన సారాకొమరు ♦ వీడి మరలదు దిటమై 19

ఉ. పూనికనాథరారమణు పుత్రుని బెండిలియాడుటొండటుల్
గానియెడన్ వృథాదనరు ♦ కాయముపైఁగలయాసలన్నియున్
మానుటొకండు గాకయిటు ♦ మాటికిమాటికి పెక్కుయోచనల్
పూనినఁ గార్యసాధనము ♦ పుట్టునె కార్యమునిల్వనేర్చునే 20

తే-గీ. అనుచునీరీతి వెంగలి ♦ యైవదరుచు
వగలఁబొగులుచుఁగన్నుల ♦ వరలునీరు
గోలమీటుచునున్న యా ♦ కొమ్మతోడ
నా కళావతి మెల్లన ♦ యనియెఁ బ్రీతి 21

క. పోయెద నీహృదయేశ్వరుఁ
డేయెడ వసియించియున్న ♦ నే యతి నగుచున్
డాయంజని మదిఁ గూర్చెద
నీయెడ నూరడిలియుండు ♦ మిది నిజమమ్మా 22

వ. అనికళావతి రాజతనయ నోదార్చి. 23

సీ. బంగారుచాయలఁ ♦ బరిహాసింపఁగఁజాలు
తనమేనినిండ భూ ♦ తిని యలంది
శారదాపూర్ణిమా ♦ చంద్రుఁ గేరుమొగంబు
నం దూర్ధ్వపుండ్రంబుఁ ♦ బొందుపరచి
అణిముత్తియముల ♦ హారంబులెడలించి
నలినాక్షమాలిక ♦ లలవరించి

బంగరు సరిగంచు ♦ పట్టుపుట్టం బూడ్చి
కాషాయచేలంబుఁ ♦ గటినమర్చి.
తే.గీ. నీల శైవాల మోయనఁ ♦ జాలునట్టి
తనదుకీల్జడ జడలుగాఁ ♦ దగ నమర్చి
యోగదండంబుఁ జేఁబూని ♦ యోగియనఁగ
రాజసుతుఁగాంచ నేగె ♦ నా రాజవదన.                                 24

చ. అటుఁ చనికాంచె నాజలరు ♦ హాయతలోచనసంతసంబునన్
పటుతర ఘోటకవ్రజము♦ భద్రగజోత్కర మార్యవాసమున్
భట నట గాయకాంచితము ♦ పార్థివ వాసము దివ్యగోపురో
త్కటతర చుంబితాంబర వి ♦కాసము నా యమరావతిన్నగన్

చ. అనుపమదివ్యహర్మ్యములు♦నందములైతగుపువ్వుదోఁటలు
న్ఘనముగు మేలగడ్డలును ♦ గాంచఁగ నబ్బురమొందఁజేయు శో
భనకరమైనమేడలును ♦ భాసిలు నా యమరావతీ పురిన్
గనుఁగొని యాలతాంగికుతు♦ కంబునఁ బుష్పవనానుగామియై

వ. ఇక్కడవడి నక్కమానాతపస్వి పురంబుఁ బ్రవేశింపక పరిచ్ఛన్నంబుగాఁ బుష్పవాటిం జొచ్చి యొక్క రసాలపాదపంబుక్రింద నాసీనయై యున్న యెడ నవ్వనపాలకుఁ డత్తాపసిం గాంచి యబ్బురంబునఁ దత్పట్టణాధీశుండగు శూరసేన మహీపాలుంజేరి కరంబులు ముకుళించి.                                 27

క. మనుజేశ యుప వనంబున
ఘనుఁడగునొక యోగివరుఁడు ♦ గనుపించెడు న

య్యనఘు దరిశించివచ్చితి
జననాయక చిత్తగింపఁ । జను నామునికిన్ 28

వ. ఇవ్విధమ్మున నవ్వనపాలకుండు విన్నవించిన నమ్మున్న
ఱేఁడు కరం బబ్బురంబున నయ్యోగీంద్రు సందర్శనోత్సుకుండై
తనభృత్యామాత్యపుత్రాది ప్రియవర్గంబులు పరివేష్టింపఁ బా
దచారియై యవ్వనంబునకరుదెంచి యందుఁ దపోనిష్ఠాగరిష్ఠుం
డును మౌనముద్రాలంకృతుండును నగు నయ్యోగీంద్రుంగని
సాష్టాంగ దండ ప్రణామంబు లాచరించి కరకమలంబులు ముకు
ళించి నిలిచియున్న రాజేంద్రుని జేసన్నలఁగూర్చుండ నియమిం
చి యొక్కింతతడవునకు గనుదమ్ములువిచ్చి యానృపాలశేఖ
రుంగాంచి యత్తాపసేంద్రుండిట్లనియె. 29

ఉ. భూవరమేలె నీయనుఁగు । పుత్రునకు న్గుశలంబె పట్టపుం
దేవికి సేమమాఁగద మ । దేభములుం దురగాదిసైన్యముల్
చేవగ నున్నవే సచివ శేఖరుఁ డావిగ మిత్రవర్గముల్
బ్రోవఁగ సౌఖ్యసంపదలఁ । బొందుచునుందురె భూజనంబులున్ 30

క. అని యీవిధమునఁ గుహానా
మునినాథుం డాడ చిత్త । మున భయభక్తుల్
బెనఁగొనవినయముదోఁపఁగ
జననాథుండిట్లుపల్కె । సంయమితోడన్. 31

క. మునివర మీకరుణ న్నా
కనయము కుశలంబు గల్గు । ననఘా మీరెం

దున నివసింతురో యీతా
వ్రసరుక్షా గతముదేమి? పూతచరిత్రా. 32

వ. ఇక్కైవడి నక్కువలయేశుం డడిగిన నమ్మాయజడ ధారి యిట్లనియె. ఓరాజేంద్రా! యేము కేవల ముదరపోష ణార్థమై యొక్కయెడనుండి కాలంబుఁ గడపుకొను కపటసన్న్యాసులముగాము. శ్రీమాధవధ్యాన పరాయణులమై యమ్మహానీయుని సాన్నిధ్యంబుకొఱకు నిరంతరము పరిభ్రమించుచుండెదము. మామనంబున నేరాజపుంగవుఁడు ధార్మికుండనియు శాంతుండనియుం దోఁచు నాతనిపట్టణంబునఁ గొన్ని వాసరంబులుండి మఱియొకతావునకు నోఁబవుచుండువార మన రాజిట్లను. ఓమహాత్మా! మద్గృహంబునకు విచ్చేసి యందుఁ గొన్ని దినంబులుండి నాయొసంగు నాతిథ్యంబులఁగొని మమ్మనుగ్రహింపుఁడన మునివరుండిట్లను మేముగృహంబుల నుండనొల్ల మిస్వ్వనంబునఁ గొన్నినాళ్ళుండియానలమాంయిచ్చవచ్చిన యి—కుం బోయెద మనుఁడు నమ్మానవేంద్రుం డాయోగీంద్రునకుఁ దాఁగొనివచ్చిన ఫలాహారంబులర్పించి తననందనుండగు మాధవుని దత్సేవార్థం బచ్చటనునిచి యక్కుహనాతాపసు నానతిఁగొని తనభృత్యవర్గంబులుగొలువఁ బురంబునకేగె. అంతనమ్మాధవ కుమారుని యాకారవిలాసంబులంగాంచి యతివేష ధారిణియగు నామించుబోఁడి దనమనంబున. 33

ఉ. అద్దిరవీనిచక్కఁదన ♦ మయ్యలకేశునిపుత్త్రుఁ జంద్రుని
న్నద్దయునాసురేంద్రసుతు ♦ దామరసాంబకు నవ్వసంతునిన్
గొద్దిగఁజేయఁజాలు నవ ♦ కోమలరూపుని వీనిఁగాంచియే.
ముద్దియయైన మోహమున ♦ మున్గకనిబ్బరమున్వహించునే.

క. తగు నీ రాకొమరుఁడు మా
మగువకు మా రాజపుత్త్రి ♦ మఱియుందగు నీ
వగకానికి వీరలకు
న్దగులం బొడఁగూర్చువిధిని ♦ దరమె నుతింపన్. 35

క. అని యాచందంబున నా
వనజాతదళాక్షి రాజ ♦ వల్లభసుతునిన్
గనుచుండ రాసుతుండనె
ఘనమగుభయ భక్తియుక్తి ♦ కౌతుకమొప్పన్. 36

తే-గీ. అనఘచారిత్ర మీరెఱుం ♦ గనివి ధరణిఁ
దడవిననునెందులేవని ♦ తలఁతు మదిని
నాదుభావిస్థితులఁ దెల్పి ♦ నయముమీఱ
మహితగుణ నన్నుఁ బ్రీతిని ♦ మనుపవలయు. 37

క. అనుటయు నక్కహనాముని
కనుదమ్ములొకింతమోడ్చి ♦ గ్రక్కునమఱలన్
మనుజేంద్ర సుతుని గనుఁగొని
ఘనవాక్చాతుర్య మమరఁ ♦ గా నిట్లనియెన్. 38

ఉ. చెప్పెడిదేమి యింక నృప ♦ శేఖరనందన యొక్క జవ్వనిన్

ఒప్పుల కుప్పయైతనరు ♦ నొక్కమహీంద్రుని పుత్రిఁ బెండ్లియై
యొప్పెడు పొన్నునుండి దిగ ♦ వెల్లరిలోఁ దలమానికంబవై।
యొప్పుచునుండు వింక సుగు ♦ ణోజ్వల మాటలువేయు నేటికిన్
చ. అనుటయు నానరేంద్రసుతుఁడక్కహానాముని కిట్లుపల్కు
నా। వనజదళాక్షి యేధరణి ♦ వల్లభుపట్టియొ రూపురేఖలే।
యనువుననొప్పుచున్నవియొ ♦ యాలలితాంగికి నామమెద్దియో
యనఘ దయారసంబొలుకు ♦ నట్టులు నన్నుపఁగాంచి తెల్పవే.

తే-గీ. ఇటుల నుత్సాహియై ధర ♦ ణీంద్రసుతుఁడు
తన్నుఁ బలుమరు వేఁడ నా ♦ తపసి వరుఁడు
కన్నుదమ్ములు ముకుళించి ♦ ఘనత యోగ
మార్గమునఁ గాంచినట్టుల ♦ మగుడి పలికె. 41

ఉ. భూపకుమారవర్య విను ♦ భూమికి మధ్యప్రదేశమందునన్
జూపడునట్టి శోభవతి ♦ సొంపుగ నేలెడు రత్నగర్భుఁడన్।
భూపకులాగ్రగణ్యునకుఁ ♦ బుత్రికయై తగె పద్మయంచనన్
దాపసకోటికైన మరు ♦ తాపముఁ గూర్చెడురూపసంపదన్ 42

సీ. ఘన కృష్ణవిభవంబుఁ ♦ గాంచి యంతటిలోన
వెల్లనై ఘోవు మొ ♦ యిళ్ళు సరియె
తనకళల్ సరిలేక ♦ తగ్గుమొ గ్గగుచుండు
పరిపూర్ణ రాజబిం ♦ బంబుదీటె
నమ్రిభావముఁ బూని ♦ నలఁగి శుష్కించెడు
సింగిణీవిం డ్లీడు ♦ చెందఁగలవె

తలపంటిసీటిలో ♦ నిలచి యెల్లప్పుడు
దాఁగెడు మీనముల్ ♦ తరములగునె.
లేఖలఁ దనరూపు ♦ రేఖల సొబగుగా
దిద్దించుకొనెడు శిఖి ♦ స్త్రీటులగునె
చందంబుఁగోల్పోయి ♦ క్రిందికివ్రాలెడు
సంపెంగపూవులు ♦ సాటియగునె
తను రాగమాధుర్య ♦ మమరఁ గోల్పోవుచు
యిలమీఁదఁబడు బింబ ♦ ఫలము లీడె
అందంబుగానుండి ♦ యంతలోవిరియుచు
వాడెడు కుందముల్ ♦ జోడు లగునె

తే-గీ. కాంతకురులకు నెమ్మోము ♦ కన్బొమలకు
వాలుగనులకుఁ జెవులకు ♦ వనిత నాసి
కంబుచందంబునకు నధ ♦ రంబునకును
కొమ్మకందంబులగు రద ♦ నమ్ములకును 43

సీ. నీటిలోనమునింగి ♦ నిలువెల్లవెల్లనౌ
చిందంబు లెటుసాటి ♦ చెందఁగలవు
పలుగాకులనుగూడి ♦ పంచమత్వముఁజెందు
పరభృతంబులుసాటి ♦ పరగఁగలవె
కోమలారుణరుచుల్ ♦ గోల్పోయినీటిలో
కాలంబుఁబుచ్చుపం ♦ కజములీడె

అత్యున్నతత్వంబు ♦ నందినీలిమఁ జెంది
పరగెడు కుంభికుం ♦ భములు జోడె
క్రిందుమీఁదై యుప్పు ♦ కొండలనుండుచు
గాసిఁజెందు రథాంగ ♦ కములు సరియె
కడుజడత్వంబునఁ ♦ బుడమిపైఁబడియుండు
కదళీతరుల్ సరి ♦ కాంచఁగలవె
తే-గీ. తనదుశిరమును గుక్షిలోఁ ♦ దగనమర్చి
మలఁగుచుండెడునట్టి కూ ♦ ర్మములుతోడె
వనితగళరవ హస్తముల్ ♦ చనులు పిరుదు
తరుణితొడలకుఁ జిన్నిపా ♦ దంబులకును 44

చ. అనియిటులాలతాంగి విభవాతిశయంబుల రూపసంపదల్
దనవచనాచమత్కృతిని ♦ దద్దయుఁ బల్కెడునమ్మునీంద్రునిన్
గనుఁగొని కౌతుకంబొలయఁ ♦ గామినిపైఁ దగు చిత్తవృత్తితో
మనసిజ రాగ మగ్నుఁడయి ♦ మానవనాథకుమారుఁ డిట్లనున్.
ఉ. ఓమహితాత్మ యోనయగు ♦ నోజ్వలయోకరుణాసముద్ర
యా। కామినినన్నుఁ గూర్పఁదగు ♦ కార్యధురంధరులీజగంబునన్
నామదియుండుఁ దోపదిఁక ♦ నాపయిసత్కృపఁబూని మీరలా
కోమలినన్నుఁ గూర్పఁగయి కొండిదెవందనమాచరించెదన్ 46

వ. ఇప్పగిదిఁ దనపాదకమలంబులకు శిరంబుసోక సాష్టాం
గ దండప్రణామంబాచరించిన రాసుతుం దనకరంబున లేవనెత్తి
యొక్కెడఁ గూర్చుండ నియమించి యమ్మహామునివరుం
డిట్లను సంసారత్యాగంబొనర్చి నిరంతరముమాధవధ్యానంబునఁ

గాలంబుఁ గడపుచుండు మాపై నీభారంబుమోపితివి. ఎట్లయిన నెల్లియప్పట్టణంబునకుంబోయి కార్యంబుసానుకూలంబగునటు లొనర్చి మరల వచ్చెద నీఁకనూరడిలియుండుమని యక్కుమారుని వీడ్కొనియరిగె నంతరాసుతుండు విరహవేదనా దోధూయమాన మానసుండై తననర్మ సఖునిగాంచి యిట్లనియె. 47

ఉ. అక్కట నామనంబు కడు ♦ నాకులతందపింపసాగె నే
చక్కనినైన దానిఁగన ♦ సంయమినాథుఁడు పోవుచెప్పు తా
నక్కమలాయతాక్షి హృద యంబునునాపయిఁబూన్చు నెట్లు
నా కక్కటికంబుఁబూని కల ♦ దంతయుఁ దెల్పుట యెట్లుమిత్రమా

ఉ. తాపసవర్యు వాక్యములుతథ్యమెయౌనె యమాత్యపుత్ర నే
నీపనిమోప నాయెడల ♦ నీర్ష్యవహించెనో యట్ల కాక నా
తాపముఁగాంచిజాలిపడి ♦ తద్దయుఁగార్యము సేయఁబూనెనో
యేపగిదిన్ మదిన్నిలుపు ♦ దెట్టులుతాళుదునింక మిత్రమా 49

ఉ. ఆసుకుమారగాత్రి విభ ♦ వాతిశయంబులు నామనంబునం
బాసిచనంగఁబోదు క్షణ ♦ మాత్రము తాల్మివహింపఁబూనినన్
శ్రీసుతుఁ డిట్లు నామనసు ♦ చిందరవందర సేయఁ బూనె నే
దోసముముందొనర్చితినో ♦ దుఃఖములన్ భరియింపనక్కటా 50

వ. ఇట్లమ్మాధవ కుమారుం డనేక విధంబులఁ జింతించుచున్న సమయంబున నాతని మిత్రుండగు కళాచంద్రుండిట్లనియె. ఓ రాజనందనా యిందుల కింత వంతనొందఁ గారణంబు లేదు. తపోధనుని వాక్యంబులందు నమ్మకముంచుము ఆయనఘుని రాక

నిరీక్షింపుము. అచిరకాలమున నన్నియుసిద్ధించును గొంచెమో
పిక వహించియుండు మని యనునయించుచుండె నట్టియెడ 51

## సూర్యాస్తమయవర్ణనము.

ఉ. భూపకుమారవర్యుఁ డల♦ భూవిభునందనఁ బెండ్లియాడిసం
తాపమువాసి మోదమునఁ ♦ దా విలసిల్లెడు నప్పు నెమ్మదిన్।
జూపుము యానమందు ధరఁ♦ జుట్టును వేగ దినేశయుంచుఁదాఁ।
గోపముతోనడల్చెననఁ♦ గొబ్బునఁదాల్చెనభంబురక్తిమన్. 52

తే-గీ. చరమగిరియనియెడుతాళ ♦ తరువునందు
పండి వ్రాలిన పరిపక్వ ♦ ఫల మనంగ
నఖిలదిక్కుల రాగంబు ♦ లలమికొనఁగఁ
బశ్చిమాంబుధిలోఁ గ్రుంకె ♦ భానుఁ డంత. 53

చ. అధికులుమాటుకేగునెడ♦ నల్పులు డాంబికవృత్తితోడుతన్
బుధులవిరోధమార్గములఁ ♦ బూనినకైవడిఁ గారుచీఁకటుల్
నధికముగాఁగనిండె జగ ♦ మంతయుఁ జేష్టలుమానియుండె మ
స్మధునకుఁజిక్కి జారు లను♦మానముఁదక్కిరిచోరులున్వెసన్.

తే-గీ. కువలయమునకు మోదంబుఁ ♦ గూర్చురాజు
వచ్చునెడ దిక్సతులు కాన్క ♦ లిచ్చునట్టి
మహితమా దీప్త వజ్రంపు ♦ మణు లనంగ
సరవి నభమందు నక్షత్ర ♦ సమితి పొల్చె. 55

ఉ. తూరుపుకొండపైఁబొడమె♦ దుర్జనవృత్తిని బూనువారలన్
గారియవెట్టుమేటి ఘన ♦ కౌతుకమొప్పఁగ సజ్జనాళి క

ర్వారిగ సౌఖ్యమిచ్చుదొర ♦ వాసవముఖ్యులమేల్మిఘంట య
మ్మారునిఁజోకకాఁడు బుధ ♦ మండలికిన్ముదమందఁజేయఁగన్.

ఉ. కమ్మని తెమ్మెరల్వెలసెఁ ♦ గంతుఁడుచాపము నెక్కువెట్టె జుం
జుమ్మని మ్రోఁగెఁదుమ్మెదలు । సొంపుగ నంచల యానవైఖరుల్
నెమ్మని నెమ్మియాటలును । నేరుపుమీరఁగ గండు గోయిలల్
గమ్మఁగఁగూయఁగాఁదొడఁగెఁ । గాముకులెల్లరుఁదాహమందగన్.

సీ. పరిపూర్ణసత్కళా । భాసితుఁడౌచు జ
క్కలఱేడు వేడి వె । న్నెలలుగాయ
హరుకంటి సెగచేత । నణఁగియు నతనుఁడై
నిలచిన మరుఁడు పూ । ములుకులేయ
తన గానమాధుర్య । తకు నీడు లేదని
కోయిలల్ మెండుగాఁ । గూయుచుండఁ
గ్రీడా సరోవర ♦ క్రీడలుసల్పు రా
యంచపిండులు హాళా ♦ హాళియొనర్ప
తే-గీ. మధు రసమ్ముల చవిఁ గ్రోలి । మధుపపఙ్క్తి
చెవులుదుమ్మెక్కు ఝుంకృతుల్ । సేయుచుండఁ
దాళఁజాలక రాజేంద్రి । తనయుఁ డంత
మనసిజుని గూర్చి యిట్టులు । ననియెనపుడు. 58

సీ. హరి కుమారుండనై । యవతరించుటయును
సిరి కూర్మిఁ బెనుపఁగా । వరలుటయును

నలుమొగంబులవేల్పు । నకుఁ దోడఁబుట్టుట
చంద్రుఁడు మామగా । జగతి గనుట
రెండొండుగాఁజేయు । చుండు విల్కానుట
మన్మథుం డనునట్టి । మహిమ గనుట
మిగుల సాత్త్వికవృత్తిఁ । దగఁ బూనియుండెడు
పక్షికులంబు నీ । బలము లగుట

తే-గీ. గరిమ నన్నియు మంచిసాం । గత్యములుగ
వెలయుచుండియు హీనులు । వృత్తిఁబూని
కాముకులమీఁది కుఱుకుటఁ । గాంచనేను
జన్మకాల మాహాత్మ్యంబో । శంబరారి. 59

క. పుట్టితివి హరికి సిరికిని
బట్టితివి త్రిలోకవిజయ । బాణము కేలన్
దట్టితివి హరుని మదికిని
గట్టా నిన్నెవ్వఁడడ్డఁ । గలఁడిక మదనా. 60

సీ. పాలసంద్రంబునఁ । బడసితిజన్మంబు
శ్రీసోదరుఁడను ప్ర । సిద్ధిఁ గనుట
మాధవునకు ముద్దు । మఱఁదివై యుండుట
హరుని శిరంబున । వరలు చుంట
నలుమొగంబులవేల్పు । నకు మామ వగుటయు
మహిని దక్షునకు జా । మాత వగుట

ఆదిత్యునకు జంట । వైయుండుటయుఁ దమో
నివహంబు లడఁపుచు । నెగడుటయును

తే.గీ. దలఁచిమిన్నందియుండుట । దగునుగాని
నిరపరాధులు నై తగు । విరహిజనుల
కలఁత నొందించు టిదినీకు । ఘనతగాదు
అజ్ఞు లగువారి వడువున । నమృత కిరణ. 61

తే.గీ. కువలయాప్తుఁ డటంచు ని । న్గోరిజగము
లెల్లవినుతింప నామాట । కల్లగాను
విరహిజనులను గారించ । వేడ్కఁగొనకు
మల్ల యది 'నేతిబీరకా । య' యనుపగిది. 62

సీ. ధరణినిగల ప్రాణి । తతికి నాధార మౌ
మలయానిలుఁడనంగ । మహిత యశుఁడ
మాధవాఖ్య వహించి । మహిఁగల్గు జీవుల
నలరింపఁగాఁ జేయు । నట్టిఘనుఁడ
హరినామకీర్తనం । బమరఁగావించుచు
కాలంబుఁ బుచ్చు శు । క వ్రజంబ
ఆకలంబులఁదిని । యడవుల లోపల
ఘనవృత్తినుండు పి । క నికరంబ

తే.గీ. మధు రసమ్మునుగ్రోలి స । న్మార్గవృత్తి
గరిమ సరసులనుండు భృం । గమ్ములార

పరుల కుపకారవృత్తిచేఁ । బరగుమీరు
కాముకుల నిట్టు లలచుట । ఘనతకాదు.		63

వ. ఇట్లు మన్మథ శరశ్చంద్ర మందానిల వసంత శుక పిక మధుపబృందమ్ములఁ దూలనాడి యారాసుతుం డొక్కపుప్పొడితిన్నెపైఁ బడి మూర్ఛఁజెందిన నాతని నర్మసఖుండు శైత్యోపచారంబులఁ దేర్చి యిట్లనియె.		64

తే-గీ. రాకుమారక యిట్టు లా । రాటపడుచు
వేల్పులను దూరనాడెదు । వెడఁగు కరణి
వార లపకృతి యొనరించు । వారు గారు
నీకు మన మిప్పు డీరీతి । నెగడెఁగాక.		65

క. అని యీచందంబున నా
మను జేశ్వర పుత్త్రితోడ । మంత్రికుమారుం
డనునయ వచనంబులతో
ననువుగఁ దెలుపంగ నెల్ల । నయ్యె నలుదిశల్.		66

తే-గీ. విరహులను బిట్టలంచుచు । వేటలాడి
మరుఁడు విక్కెక్కుడించె స । న్మార్గవృత్తి
శుక పికంబులు మౌనంబుఁ । జూప సాగె
నపరవారిధిఁ జేరఁగా । నరిగె శశియు.		67

సీ. జతఁ బాసి దుఃఖించు । జక్కవ కవలెల్ల
ముదముతోఁదనరాక । కెదురుచూడ

అఖిల లోకంబుల । కాధారభూతుఁ డీ
తఁడనిబుధులు సం । స్తవమొనర్ప
తనమిత్రుఁడే తెంచె । ననియరవిచ్చుచు
తమ్మిలెల్లను సంత । సమ్మునంద
చంద్రాతపమ్మున । శ్రమ జెందియున్నట్టి
కాముకుల్ దనుగాంచి । కలకఁదేర

తే-గీ. ధరణిఁ గలజీవులెల్లఁ జై । తన్యమంద
నఖిలదిశలను ధ్వాంతమ్ము । లంత మంద
నరవి లోకంబులకునెల్ల । సాక్షియగుచు
నుదయపర్వతమున భానుఁ । డుదయమయ్యె. 68

చ. అటులదివాకరుం డుదయ । మందిన రాజకుమారుఁగాంచి
దా। నిటులవచించె వానిసఖుఁ । డివ్వనసీమ వసింప మారుఁడ
క్కటికము లేక నేచెడిని ♦ గాన పురమ్మున కేగుదెమ్ము నీ
విటుల మెలంగఁ గాంచి ధర ♦ ణీశ్వరుఁ డేమయిన న్దలంపఁడే69

వ. ఇవ్విధమున నారాజసుతుండు తనచెలికానిచే నను స
యింపంబడి పురంబుసొచ్చి మద నానల సంతప్తమాన మాన
సుం డగుచుండె నంత నక్కడ. 70

తే-గీ. ధరణివిభుపట్టి యంత మా ♦ ధవ కుమారు
మహిత సుకుమార రూపముల్ ♦ మదిఁదలంచి
అతనుతాపంబు నోర్వక ♦ యంతిపురిని
బువ్వుపాన్పునఁ జేగ యా ♦ పువ్వుబోఁడి. 71

ఉ. అక్కటక్రూరుఁడామరుఁడు♦నక్కటికంబొకయింతలేకనన్।
బెక్కువిధంబుల న్వెతలఁ ♦ బెట్టఁగ సాగె నిఁ కేమిసేతు నా।
చక్కని రాజనందనుని ♦ సంతసమొప్పఁగఁ గూడియుండఁగా।
నెక్కరణి న్ఘటిల్లు నిఁక ♦ నెవ్వరివేఁడుదు నేమిసేయుదున్. 72

ఉ. పోయెనొ నాయనుంగుచెలి♦ భూవరుపీటికి రాకుమారునిన్
డాయఁగ నేయుపాయము వ ♦ నంబునదావహించునంతటన్
యేయనువూని నాదు తెఱఁ♦ గెల్లవచించునో రాకుమారుఁడున్
నాయతిదీనత న్వినునొ ♦ నన్నృపఁ గాంచునో కాంచఁడోమదిన్.

క. ఈరీతి నవ్వధూమణి
మారుని తాపంబునకును ♦ మదినోర్వక శృం
గారమ్ముఁదక్కి తానొక
తీరున నున్నట్టిదానిఁ ♦ దిలకించి సఖుల్. 74

తే-గీ. రాకుమారిక యిపుడేమొ ♦ రహిదొలంగి
కరము కృశియించుచున్నది ♦ కాంతలార
యొడయఁడెఱిఁగినఁ గోపంబు ♦ నొందునేమొ
దీని కేమి యుపాయమో ♦ తెలుప రమ్మ. 75

తే-గీ. అనితలంచుచుఁ జెలులెల్ల ♦ రాన్నృపాల
తనయ డగ్గరి నేరుపు ♦ తనముతోడ
మాటమాటలవరుస నా ♦ మగువఁగాంచి
యింపుసొంపులు దళ్కొత్త ♦ నిట్టులనిరి. 76

క. తుహినాంశువదన నీవిటు
లహహా మోదంబుఁ దక్కి ♦ యాత్మనలయుచుఁ దా
తహతహనొంది కలంగెడు
వహి యేటికి? తెలుపరాదె ♦ వారిజ నయనా. 77

సీ. కమ్మనివాసనల్ ♦ గలవారిజంబులఁ
దురుమున సొంపుగఁ ♦ దురుమవేమి
నవరత్నమయభూష ♦ ణంబులుధరియింప
కొక్కచందంబున ♦ నుండుటేమి
వీణియఁ జేఁబూని ♦ నాణెంబుగామించి
గీతంబులను మేళ ♦ గింపవేమి
కాళ్ళు వేళ్ళఁ మెలంగి ♦ కలసి తోడఁ బెనంగు
నంచపిండుల నద ♦ లించవేమి.

తే_గీ. మాటలాడఁగఁ జేరెదు ♦ మమ్మునెల్ల
విసువు తోడఁగఁ బల్కరు ♦ కసరదేమి
ఉస్సుసుస్సురు మంచు ని ♦ ట్టూర్పుఁ బుచ్చు
గారణంబేమి తెల్పుము ♦ కంజ వదన. 78

వ. ఇత్తెఱంగునఁ జెల్మికత్తియ లొత్తిమొత్తియడిగిన నచ్చి
త్తరి యిట్లను నో చెలియలారా ! నామనంబున కేదియో
యొక్క విధంబగు వికారం బుదయించి దేదంబు కరంబు స్వా
ధీనంబు గాకయున్నయది యద్దానికిఁ గారణంబెఱుంగ నని కప్పి

పుచ్చిన నాసఖులును బరస్పర ముఖావలోకనంబు లాచ
రించు కొనుచుఁ దమలో దామిట్లనిరి. 79

తే-గీ, తమ్మి యరవిచ్చి వలపులు ♦ ధరణి నెల్లఁ
గ్రమ్ముకొనసాగె కొదమ భృం ♦ గమ్ముఁజేరి
యలరుతేనియఁ గ్రోలఁగా ♦ వలయు నింక
నంబుజాననలార ము - దంబు మీఱ. 80

తే-గీ. అనుచు నిట్టులు నర్మవా ♦ క్యములచేతఁ
దన్నుఁ గేలియొనర్చెడు ♦ తరుణులకును
మారుపల్కకయున్న న ♦ మ్మనుజనాథు
తనయతోడుత నిట్టుల ♦ ననిరి చెలులు 81

వసంతఋతువర్ణనము.

క. ఋతురాజే తెంచెడి నని
మతినుబ్బుచు నతని కడుగు ♦ మడుగుల నిడఁగా
క్షితికాంత పట్టుపఱచిన
గతిఁ బచ్చికనెల్లయెడలఁ ♦ గన్పడెఁగనుమా 82

మత్త. కోమలంబులౌ చిగుళ్ళఁ ♦ గొంచు జీర్ణపర్ణముల్
భూమిమీఁద రాల్చివేడ్కఁ ♦ బూనుతరులఁ గాంచ నా
రామలక్ష్మి యవ్వసంతు ♦ రాక నెంచి పచ్చనౌ
కోమలాంబరంబుఁ దాల్చు ♦ కొన్నలీలఁ గన్పడెన్ 83

మత్త. మత్తకోకిలవాణి విన్నిదె ♦ మాధవుం డనురాగముల్
హత్తుచిత్తము తో వనేందిర ♦ యందమై తగునట్టులన్

చిత్తముం దున సంతసంబును ♦ జెందుభూప లోసంగెనాఁ
గ్రొత్తక్రొత్త సుమంబులెల్లెడఁ ♦ గొల్లగా వికసించెరన్.

స్రగ్విణి. ఆమనీనాయకుం ♦ డాదరంబొప్ప నా
రామశ్రీ గూడ స ♦ ద్రాజ కీరావళుల్
కోమలం బొనటుల్ ♦ గోరి గానంబునన్
కామినీపాడెడిన్ ♦ గాంచు మోదంబునన్ 85

పంచచామరము.

వసంతురాక నెంచి పంచ ♦ బాణుఁ డాత్మనుబ్బుచున్
వెసల్ వికాసమంద నేగు ♦ దేరరాజకీరముల్
వెసన్ మధువ్రతంబులెల్ల ♦ వెంటఁజేరి మాధురీ
రసంబులొల్కఁ బాడెడి న్ని ♦ రంబుగాఁగ నిమ్ముడన్ 86

మలయజవృత్తము.

మలయజగంధిరొ ♦ మదనునిఁగన్గొని ♦
మనమునసంతస ♦ మందుచుఁదాఁ
జలువజలంబుల ♦ స్నానమొనర్చియుఁ ♦
జందనశీతల ♦ చర్చితుఁడై
యలరులతావులు ♦ నంతటనిండఁగ ♦
నతిముదమునఁజను ♦ నట్టులుదా
మలయసమీరుఁడు ♦ మాటికిమాటికి
మందగతింజను ♦ మాడ్కిఁదగన్ 87

స్రగ్విణి. కాంతుఁ డేతెంచుటల్ ♦ గాంచు నారామశ్రీ
కాంత మోదంబున ♦ న్గమ్మనౌ పుష్పముల్
గాంతుపైఁ బల్మరుఁ ♦ గ్రమ్మఁగాఁజల్లు న
ట్లింతిరో పుష్పొడుల్ ♦ నెల్లవై పుల్ దగెన్ 88

మణిరంగవృత్తము:—
కలికీ విరహులఁ ♦ గాఱియ వెట్టన్
చెలువుగ మారుఁడు ♦ చేతధరింపన్
అలరుశరంబన ♦ నదె కింశుకముల్
కలికిరో గనుమిదె ♦ గ్రాలుచునుండెన్ 89

తే-గీ. ఆమనీ నాథునకుఁ బూజ ♦ లధికభక్తి
తో నొనర్పఁగవలెనిఁకఁ ♦ దోయజాక్షి
పువ్వుదోటను జేరఁగాఁ ♦ బోదమింక
చెలువుమెఱయఁగఁ దోటినె ♦ చ్చెలులుగొల్వ 90

వ. ఇవ్విధంబున నవ్వధూమణిం దోడ్కొని రసాల సాల హింతాల తాల తక్కోల తమాల నారికేళ లవంగ లుంగ పున్నాగ పూగ కదంబ నింబ జంబీర పిచుమంద మందార పారుజాత కుంద శ్రీగంధ కనక వకుళ కురంట కాశోక కపిత్థ ఖర్జూర కోవిదార చంపక మల్లికా మాధవీ కుంజ పుంజ రంజితంబగు వనంబు ప్రవేశించి. 91

సీ. సుందరీమణితోర్తు ♦ చూతపల్లవములఁ
జిదిమి పయ్యెంటలో ♦ నదిమికొనియె

కామినీమణియోర్తు ♦ కౌతుకమొప్పఁగాఁ
జెలువుమీరఁగఁగల్వఁ ♦ జెవినమర్చె
వారిజాననయోర్తు ♦ పారిజాతంబుల
దామంబు గళమునఁ ♦ దాల్చికొనియె
మంగళాంగియొకర్తు ♦ మల్లికాకుసుమముల్
గొనితెచ్చి తనదు కొ ♦ ప్పుననమర్చె

తే-గీ. తరుణియొక్కతె చందన ♦ తరులనీడఁ
గూర్మి దళుకొత్తవల్లనఁ ♦ గూరుచుండె
మాధవీలతఁగొని యొక ♦ మగువమిన్న
అరుతధరియించి మోదంబు ♦ నందెమఱియు 92

చ. అలరు శరంబుఁగాఁగొనుచు ♦ నంబుజనేత్రియొకర్తు నేనపు
వ్వులవిలుగల్గుమేటి నని ♦ పూని వచించినఁ గమ్మపుష్పొడుల్
జెలువుగ మేనఁబూసి యొక ♦ చేడియ నేనహరుండ నంచు దాఁ।
బలుమరుఁజెప్పుచు న్వివిధ ♦ భంగుల దానివదల్చెదిట్టయై 93

చ. చెలువుగనొక్కకాంత తన ♦ చేతసరోజమునంది యిందిరా
జలజదళాక్షీ నేనఁనగ ♦ జయ్యనఁ బుష్పసరఁబు కంఠమం।
దలరధరించుకొంచు నొక ♦ యన్నువ నేవనమాలినంచుఁ దాఁ
బలుకుచుదానివక్షమునఁ ♦ బల్మరుజేర్చె ముదంపుమెంపునన్ ॥

సీ. హరిమధ్య యల్లదే ♦ విరులుగోయుచునుండె
దానిఁ జేరఁగఁ బోకు ♦ దంతిగమన

శుకవాణి యదిగో కిం ♦ శుకముమాటున డాగె
సాధించునిన్ను బిం ♦ బాధరోష్ఠి
చంద్రాస్య యది బంతి ♦ సరముచేఁ బట్టెను
అంబుజనేత్రి నీ ♦ వటకు జనకె
రామ యల్లదిగో యా ♦ రామంబుఁ గాంచెడు
పికవాణి ♦ దానిని బిలువఁబోకు

తే-గీ. చంపకామోదయదినీదు ♦ సఖ్య మెంచె
మాటునకు నేగి డాగవే ♦ మధుపవేణి
యనుచు నిటులొక రొకరితో ♦ నాడుకొనుచు
మఱియునుత్సాహవశమున ♦ మగువలెల్ల. 95

క. సుందరి యొక్కతె మధుకర
బృందమ్ములఁ దోలి కమ్మ ♦ విరితేనియ లం
దంద వెసఁ గ్రోలెఁ దగ్గను
సుందరులకు నెల్ల వ్రేలు ♦ జూపుచు వేడ్కన్. 96

ఉ. మానినియోర్తు వంగి కుసు ♦ మంబులు నేరుటగాంచి యల్లన
న్దానతిమోద మొప్పఁ జని ♦ తద్దయుదాని భుజంబుపై బదం
బూనిచిలాఘవం బెసఁగఁ ♦ బువ్వులతీవియనంది యుయ్యలల్
పూనికెనూగెఁ జిత్తమునఁ ♦ బొందు ముదంబిగురొత్త బ్రోడయై

సీ. సమాలిక సరసిజముఖియోర్తు ♦ సహకార భూజంబు
కరములఁ జేసంది ♦ గారవించె

కలకంఠియొక్క-తె ♦ తిలకద్రుమంబును
గౌతుకమొప్పఁగాఁ ♦ గలయఁజూచె
సింధువారమునీడ ♦ సుందరీమణియోర్తు
నాసీనయై ముదం ♦ బలరనూర్చె
తరుణీమణియొకర్తు ♦ కురువకంబును జేరి
కౌఁగిటఁగదియించి ♦ గారవించె
వారిజాననయోర్తు ♦ వకుళభూజముఁజేరి
రమణదలిర్ప క ♦ ల్లుమిసివైచె
కలికియొక్క-తెయశో ♦ కంబు డాయఁగ నేగి
తన పాదపల్లవం ♦ బునను దన్నె
కలకంఠియోర్తు ప్రేం♦ ఖణమునీడ వసించి
నీటుతలిర్పగాఁ ♦ బాటఁబాడె
నయమదలిర్పఁగా ♦ నాగవేణియొకర్తు
పొన్నమ్రాకును జేరఁ ♦ బోయినగియె
నాగయానయొకర్తు ♦ గోఁగుఁజేరఁగనేగి
మంజులంబై తగు ♦ మాటలాడె
చంద్రాస్యయొక్క-తె ♦ చంపకంబునుడాసి
వరునడియానన ♦ ప్రభలు నెఱపె

తే-గీ. ఇటుల దశదోహదంబుల ♦ నింపుఁగాంచు
తరుల నలరులనెత్తించి ♦ తరుణులపుడు

మఱియు నుత్సాహవశమున ♦ మగువలెల్ల
కూర్మిజలకేళియొనరింపఁ ♦ గోరిమదిని. 98

క. తరుణీ కన్గొను మల్లదె
సురుచిరమగు పాదపములు ♦ చుట్టును వెలయన్
కరమరుదుగూర్చు నా పు
ష్కరిణిన్ జేరంగవలయుఁ ♦ గౌతుకమొప్పన్ 99

సుగంధి వృత్తము.

అంబుజాక్షి కంటె నిర్మ ♦ లాంబుపూరమాచు మో
దంబుఁ గూర్పజాలునట్టి ♦ తమ్మి లుల్లసిల్ల భృం
గంబు లా సరోజపాళిఁ ♦ గ్రమ్మిగ్రుమ్మి తేనియల్
సంబరంబుతోడఁగ్రోలు ♦ చక్కఁ జూడు వేడుకన్ 100

క. కావునమనమెల్లరము స
రోవరకేళీవిలాస ♦ లోలతమెఱయన్
ఠీవి జలకేళి సల్పఁగఁ
బోవలయు నటంచు నెంచి ♦ పొలఁతుకలెల్లన్ 101

తే-గీ. వలువలనువిప్పి యంతనా వనితలపుడు
పాణితలములుపట్టి సం ♦ భ్రమమెలర్ప
పరగ మొలబంటికుత్తుక ♦ బంటినీట
నళుకులేకచరించి ర ♦ య్యతివలపుడు 102

శా. బాలారత్నమొకర్తు నీరములలోఁ ♦ బల్మారునుత్సాహియై
చాల న్మోదమెలర్ప నీఁద మఱియా ♦ చంద్రాస్యనెమ్మేనికిన్

హాళి నీల్జడ చుట్టికొన్న భుజగం ♦ బం చాసరోజాక్షి తా
నోలిన్ భీతిలి కేకవైచెఁ జెలులో ♦ హాయంచుఁగేల్చేయఁగన్

చ. కలకియొకర్తు వెల్లకిలఁ ♦ గాఁబవళించి జలంబులోపలన్
బలుమరు నీఁద దానిచను ♦ బంతులఁగన్గొని నీరజాత కు
ట్మలమనుచు న్దలంచియొక ♦ మత్తమరాళము జీరఁజేరినన్
గలఁగుచుఁబొబ్బవెట్టియొక ♦ కాంతనుగాఁగిటఁజేర్చె భీతయై 104

ఉ. కొమ్మయొకర్తు తమ్మిఁగని ♦ కోమది నాసజనింప నందుభృం|
గమ్మునదల్పఁబోవనది ♦ గ్రక్కున నాజవరాలియాస్యమున్
దమ్మియటంచు నెంచి మదిఁ ♦ దద్దయు నాజలజంబువీడి యా
కొమ్మముఖంబుపై ముసరు ♦ కొన్న భయమ్మున నాలతాంగి యో
యమ్మ యికెట్టులంచుఁ గడు నార్చెఁ జెలుల్వెరగంది చూడఁగన్

తే-గీ. అంత జలకేళిమానియా ♦ యతివలెల్ల
కొలను వెల్వడి జిలుగు వ ♦ ల్వలుధరించి
తొడవుల నలంకరించియుఁ ♦ గడుముదమున
రాజసుతఁ దోడుకొంచు నా ♦ రాజముఖులు 106

వ. ఈచందంబున నమ్మందయాన లమందానంద కందళిత హృదయారవిందలై యిందిరానందనుం బూజించువేడ్క డెందంబుల సందడింప నక్కమలాకర పురోభాగంబున నిరంతర పల్లవ కుసుమ సంశోభితంబును తత్కుసుమ నిర్గత సువాసనా భరితంబును నిరంతర మధుపాన మత్త భృంగ సంగీత సమాకులంబును శారికా కీర పిక కలకలారావ మనోహరంబును నగు

నొక్కఁ మాధవీ లతామంటపంబునం బ్రవేశించి. 107

లయగ్రాహి. అంతట లతాంగులసు ♦ రాంతక తనూభవు
ల తాంతముల వేడ్కఁ మొయిః నర్చనలు సేయన్
వింతలగుపుష్పాదుల ♦ వేడ్కఁగొని తెచ్చి యట
వింతగను దిన్నె సల ♦ వించియుదమందన్
సంతసగ మనోభవుని ♦ వ్రాసియ మృగనాభి యొక
కొంత ఘనసార మొక ♦ కొంత హిమతోయం
బంతయు వెసన్గలిపి ♦ యంగజుని రూప మిసు
మంతకొఱవోక నిక ♦ చాబ్జముఖులెల్లన్. 108

వ. కుసుమాస్త్రుని రచియించి. 109

సీ. తెఱవయొక్కతె మల్లె ♦ విరుల హారముఁ గూర్చి
యుండ మొప్పఁగ మరు ♦ నురము నుంచె
పంకజాక్షియొకర్తు ♦ పద్మముల్ బాణంబుఁ
గాఁ గూర్చి మదనుని ♦ కరముఁ జేర్చె
కలికియొకర్తు పూ ♦ వులవింటి జేనికి
చిలుక తేజీ ముదం ♦ బలర నిల్పె
శారికాశుకపిక ♦ జాలంబు నొకనాతి
మరుని బలంబుఁగా ♦ సరస నిల్పె

తే.గీ. అలరుఁబోఁడి యొకర్తు కెం ♦ దలిరుఁబాఁకు
సరివి నొలుఁ జెక్కి రతి వ్రాసి ♦ సరస నిలిపె
అతనునికిఁ గూర్మిప్రియయగు ♦ రతికిఁ జెలులు
భక్తియు క్తియు మనమునఁ ♦ బరగుచుండె. 110

క. ధ్యానము శ్రీనారాయణ
సూనున కావాహనంబు ♦ సుమచాపునకున్
మానసవాసున కర్ఘ్యము
పూనికఁ బాద్యంబు సర్వ ♦ పూజ్యునకు వెసన్. 111

క. జలకము మరునకు నలరుల్
కలువలపూవింటిదొరకు ♦ గంధము నెమ్మిన్
మలయసమీరుని సఖునకు
సరవిని ధూపంబు వినుత ♦ శౌర్యోన్నతికిన్. 112

తే-గీ. తిమిర భయవారణున కిదె ♦ దీప మఖిల
లోక మోహనునకు సక ♦ లోపహార
మనుచు నర్పించి సేవలు ♦ నతివ లెల్ల
భక్తిఁ గేల్మోడ్చి యిట్లని ♦ పల్కి రపుడు. 113

ధృవకోకిల.–
హరికుమార కృపాసముద్రవి ♦ హంగవాహ రతీశ శ్రీ
వరసమాన త్రిలోకసుందర ♦ వారిజాంబక హస్తధీ
వర సురాసుర సర్వచేతన ♦ వంద్య నీరదగాత్ర మ
మ్మరసిసత్కరుణామతింగనుమయ్యమ్రొక్కెదమెంతయున్.

క. నీవంటి మగసిఁగూర్పుము
భావజ మారాజపుత్రి ♦ పద్మిని కనుచున్
సేవ లతిభక్తి మరునకుఁ
గావించి ధరేశుఁ బట్టిఁ ♦ గని వినయమునన్. 115

చ. అలసితినమ్మచాల వికచాంబుజపత్రి విశాల నేత్రి మే
మలరులఁగోతుమమ్మ యిటు♦లందమునైతగు పూలపాన్పునన్
బొలుపెసగంగవిశ్రమము♦పొందగదమ్మవిరుల్గ్రహించుచున్
జెలువుగ నంతిసీమకును ♦ జేరఁగఁబోవుదమమ్మ నెమ్మతిన్.

తే-గీ. అనుచు నిటుపల్కి నయమొప్ప ♦ నతివలెల్ల
పువ్వుసెజ్జను గావించి । భూపతనయ
నందు విశ్రమమును బొందు । నట్లుచేసి
నామెచే నెమ్మదిని సెల । వంది సఖులు. 117

వ. కుసుమంబులు గోసితేరనఱిగిన నక్కుసుమకోమలాంగియుఁ గుసుమశరవేదనా తప్తమానసయగుచుఁ బూపాన్పునం దనమేనువాల్చి తనమనంబున. 118

క. రాదాయెఁ గూర్మినెచ్చెలి
నాదయితుని పురముఁజేర । నరిగెనొ విభుని
న్మోదమలరంగఁ గాంచెనొ
లేదోయేమియును దోఁప । లేదకట మదిన్. 119

క. అనియిటుదలంచు నెడ నా
వనజానన కప్పు డంత । వలకన్నదరన్
దనమది శుభమనితలఁచుచు
ననువునఁ బూసెజ్జనున్న । యాసమయమునన్. 120

వ. కళావతియు మాధవకుమారుని మనంబు పద్మినీకాంతం దగులొందునట్టు లొనర్చి పరిపూర్ణ మనోరథయై రాజపు

తున్నివీడ్కొని కతిపయ ప్రయాణంబుల శోభావతీపురంబుసొచ్చి కుసుమకోమల మనోహరంబగు తననెమ్మేని కాచ్ఛాదితంబగు తాపసవేసంబునుదీసి మరల నెప్పటి సుందరీ రూపంబునఁ గన్యకాంతఃపురంబునఁ బ్రవేశించి యందుండు పరిచారికాజనంబువలన రాజనందన వనవిహారం బరుగుట యెఱింగి పువ్వుదోఁటం జేరనరిగి యచ్చటఁ గుసుమంబులం గోయు దనసంగడికత్తెలఁ బలుకరించి మాధవీలతామంటపంబునఁ బువ్వుపాన్పున సేదఁదీర్చుకొనుచుఁ దనరాకనిరీక్షించుచు గడియయొక్కయుగంబుగఁ గడపుచున్న యక్కామిని డాయంజని. 121

ఉ. రాసుతుఁగాంచితిన్మరుఁ డి॥ రంబుగ గెల్చెడి రూపసంపదన్
భాసురలీల సొంపెసఁగె ॥ భామిని నే మునిసాచు నాతనిన్
డాసి కరంబునేర్పున గ ♦ డంకను నీ సుకుమారరూపమున్
వ్రాసిగ నర్తనల్ సలుప ॥ వారిజలోచన నిన్నుఁ బెండ్లిగా
నాసనుబూని దావిరహా॥ మందెడు నిప్డు కురంగలోచనా. 122

ఉ. నాపలుకింకనీవు మది ♦ నమ్మకయుండిన నేర్పుపెంపునన్
భూపకుమారునాకృతిని♦ బూనికవ్రాసితిఁ జూడుమంచుఁ దా
నేపున రాకుమారుపట ॥ మేర్పడఁ జూపినఁ గేలనందితా
నోపికతోడ నాథుగనె ॥ నొయ్యనచిత్తము సంభ్రమింపఁగన్.

వ. ఆరాజకుమారుని యాకారసౌకుమార్యాదులం దిలకించి.

ఉ. ఎక్కడిరూపమో యిదిసు॥ రేంద్రకుమార కుబేరసూనులన్
మిక్కిలి రూపసంపదల ॥ మించుచు నున్నది మర్త్యజాతియం

దెక్కడయీాతనూవిభవ । మెంతయునుండుట యేడ నీనిని
దక్కఁగఁగాంచునుండు నల।దానిదెభాగ్యమనంగ నీభువిన్. 125

సీ. ముఖమును లావణ్య । ములపోవు వునునుగల్గు
కలువ లంచన వీని । కన్ను లమరె
చెవులతోసఖ్యంబుఁ । జేయఁ డాసినయట్టి
పోల్పుదోఁచెడు వీని । భుజ యుగంబు
మనసిజుం డాసీన । మహా పీఠమన వీని
కమనీయమైన వ। క్షంబు దనరె
సరవి లేతచిగుళ్ళ । పరిహాసించుచునుండు
పగిదిఁ గన్పడెవీని । పాదయుగము
తే-గీ. నలువనేర్పున సురరాజ । నందనాదు
లనుసృజించిన మరుఁడతి । లాఘవమున
ధాతపైఁ బద్దుఁబూని యీ । తనిసృజించె
ననఁగ నీమోహనాంగుని । యందమొప్పె. 126

ఉ. కన్నునికుందనంబుపసఁ । గాంచినమే న్దెగబారలొాచు నం
దమ్ముఁ వహించి నీలములఁ । దద్దయుగెల్చెడు సోగపెన్నెరుల్
దమ్ములఁబోలుఁగన్నులల । తామరసారిని గేరు ముద్దుమో
మమ్మకచెల్ల వింన్రిమ విం । హారము నీతస మోవియందముల్.

క. ఈసరసుఁడు ననుఁ బెండిలి
శేసికొనందలఁచి మరుని । చెలికులవింటన్
గాసిలుచుండుట తెల్లము
గాసఖిచేవ్రాసియఁబక్షియెఁ । గడునేరుపునన్. 128

చ. విరహమునంగడునొప్పలసివిన్నదనంబును బాండిమంబునున్
గరము మనోహరంబుగను గన్పడె సీతని మోమునందునన్
మరుశర తాప వేదనకు మాటికి నూర్పులు పుచ్చుభావ మ
ద్దిర లిఖియింపఁగాఁబడియె దిద్దినయట్టులు నద్దమందునన్.

ఉ. అక్కట నాపయిన్మిగుల నాసవహించికరంబుసొక్కుచున్
జిక్కి మనోజవేదనలఁ జింతిలుచుండఁగఁ బోలు నా కిఁకన్
ఱెక్కలుగల్గియున్ననిట లేచిమనోహరుఁడుండు చోటునన్
జక్కఁగ వ్రాలికాంతు సర సన్నిలతున్నద తాపమారఁగన్.

వ. అనిమనంబునఁదలఁపోసి కళావతింగని సగౌరవంబుగ.

ఉ. సంతసమొప్ప నామదికి సాహసమేర్పడ నేకతంబ నీ
వెంతయుమాని వేషమున నెల్లరకుం గను బ్రామి నామనో
కాంతునిచెంతఁజేరి యటఁ గాఁగలకార్యము నిర్వహించి నా
కెంతయుఁ గూర్చుదానివయి తేమనిమెచ్చెద నీచమత్కృతిన్

తే-గీ. కొమ్మ నాయయ్యతోడ నా కోర్కెఁదెలిపి
యతఁడు సమ్మతిఁ బొందెడు నటులొనర్చి
వల్లభుని నన్ను గూర్ప నే ర్పరివి నీవ
యనుచు మదిలోన నమ్మితి వనజ నయన. 133

వ. అనుచు బహుప్రకారంబుల దన్నుంబ్రార్థించుచున్న
నారాజపుత్రింగాంచి కళావతి సబహుమానంబుగా నిట్లనియె.

క. కొమ్మా నీకోర్కెని మన
యమ్మకు నేరుపునఁదెల్పి యవ్వల రాజున్

సమ్మతిలు నట్లొనర్చెద
నమ్మా సంతసమునొందు | మమ్మానెమ్మిన్. 135

తే-గీ. అనుచు రాసుత నిట్టుల | నాలతాంగి
యనునయించుచునుండెడు | నట్టివేళ
విరులఁ గొనితేర నరిగిన | తరుణు లెల్ల
వచ్చి వినయంబుమనముల | నచ్చుపడఁగ. 136

ఉ. ఒక్కతె లేజిగుళ్ళు మఱి యొక్కతె సొంపగుపూలబంతులన్
ఒక్కతె పద్మకుట్మలము | నొక్కతె మేలగు పచ్చకప్పురం
బొక్కతె పూలమాలికెలు | నొక్కతెకమ్మనిపూవుతేనియల్
మక్కువతో ధరావర కు | మారికిఁగానుకలొసంగి రెంతయున్

సీ. కొమ్మయొక్కతె కమ్మ | తెమ్మెరల్ గలపూల
వీవనల్ చేఁ బూని | విసరు చుండ
నుగువయొకర్తుక | పగడ పావాల్దెచ్చి
తనపాదములకు నం | దముగఁదొడుగ
రమణియొక్కరితె గా | రవముతోఁపఁగ వేడ్క
తన కేలుదమ్మి కై | దండ యొసఁగ
వలెవాటుకొం గొక్క | వనజాతలోచన
చక్కగాదిద్దుచు | సరసనడువ
ఇట్టట్టులని యొక్క | యిందు బింబానన
సరళిమార్గమునహె | చ్చరికదెల్ప

తే-గీ. మఱియుఁ గలయట్టితనతోటి ॥ మగువ లంత
కొమరుదళుకొత్తనెంతయుఁ ॥ గొలుచుచుండ
నధికవైభవమెసఁగ న ॥ య్యబ్జవదన
రమణమీరఁగ నంతి పు ॥ రంబుఁజేరె. 137

భుజంగ ప్రయాతము.

సురేంద్రాది సంస్తుత్య ॥ శుద్ధాంతరంగా
ధరాధార లోకేశ ॥ దైత్యాంతక శ్రీ
వరాంభోజనేత్రా భ ♦ వాంభోధినావా
కరీంద్రార్తిసంహార ॥ కల్యాణ రూపా. 138

గద్య:—ఇది శ్రీమదనగోపాల వరప్రసాదాసాదిత సరసకవి
తాశోభిత శ్రీమద్భాష్యకార కరుణాకటాక్షలబ్ధ పంచ
సంస్కారపవిత్రిత శ్రీమత్పర్ణశాల వంశపయః
పారావార రాకాసుధాకర కౌండిన్యసగోత్ర
పవిత్ర శ్రీరాఘవార్యా పత్య అలమేలు
మంగాగర్భజనిత శ్రీ చిల్కపాటి
సీతాంబికా ప్రణీతంబగు
పద్మినీపరిణయంబను ప్రబంధంబునందు
ద్వితీయాశ్వాసము
సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

# పద్మినీపరిణయము

## తృతీయాశ్వాసము.



క. శ్రీగోపీ హృదయేశ్వర
యాగమసంచార దురితహర సువిచారా
భోగీంద్రశయన కేశవ
నాగాంతక వినుతనామ నందకుమారా. 1

తే-గీ. అట్టియెడ భానుఁడేగ నస్తాద్రిసీమ
కాఱుచీఁకట్లుదిశలందుఁ గ్రమ్ముకొనియె
ధరణిఁగలజీవులెల్లఁ జైతన్యమెడలి
మ్రానువడి చేష్టలాయెడ మఱచియుండె. 2

ఉ. ఆయెడఁ దూర్పుభాగమున నంబుజవైరిచెలంగె నెంతయుఁ
గాయజుఁ డేపుమీఱి తన కార్ముక మెక్కిడె రాజకీరముల్
బాయక పాడసాగెఁ బికపాళియుఁ గూయఁదొడంగె తెమ్మెరల్
హాయిగవీచె లోకము సుఖాన్వితమై పొలుపొందునట్లుగన్

వ. ఇట్లు సకలజన నయనానందకరంబుగాఁ జంద్రోదయం
బైన నప్పద్మినీకాంతయు దురంత కంతు సంతాప సంతప్తమా
నసయై చంద్రాదుల నుద్దేశించి. 4

క. హరియను పేరందితి వా
హరివలె లోకములసౌఖ్యమ్ము డిందింపఁగయా

తెరువున నబలల నేచఁగఁ
బరువా నీకీవిధంబు ♦ పాకజవైరీ. 5

సీ. బాడబానలముతో ♦ పాటు సాగరమందు
జనియించినట్టి దు ♦ ర్జనుఁడ వీవు
రాహుకోరలచేత ♦ రహిఁగ్రాగి విషమును
వెదజల్లుచుండు దు ♦ ర్మదుఁడ వీవు
దైవంబటంచని ♦ తలఁపక శంభుని
తలపైకి నెక్కిన ♦ ఖలుఁడ వీవు
చెలియ లిల్లును బాడు ♦ చేసియు మిన్నంది
దనరు విశ్వాస ఘా ♦ తకుఁడ వీవు

తే-గీ. గురునియిల్లాలిఁ బట్టిన ♦ కూళ వీవు
జంటపుల్గులఁ బాపు దు ♦ ర్జాతి వీవు
కన్నసుతునకుఁ బగయైన ♦ కష్టమతివి
అబలలను నేచ నేపాటి ♦ యబ్జవైరి. 6

క. హరినందనుఁడవు ♦ నీ వా
హరికిన్బిడ్డలము మేము ♦ నగుటయు మనకున్
వరుస యనుజన్ము లగుదుము
పరువడి మామీఁదికుఱుక ♦ పాపము మదనా. 7

సీ. ఆత్మజాతనుగూడ ♦ నబ్జసంభవునకుఁ
బ్రోత్సహించిన పాప ♦ బుద్ధి వీవు

గౌతమాంగన గూడ ♦ గా నిర్జరేంద్రుని
మదిఁగలఁగించు దు ♦ ర్మదుఁడ వీవు
గురునియిల్లాలితోఁ ♦ గూడఁ జంద్రునికాశఁ
బుట్టించినట్టి దు ♦ ర్బుద్ధి వీవు
శైవంబటంచును ♦ దలఁపక శివునిపై
దాడికేఁగిన దుండ ♦ గీఁడ వీవు

తే-గీ. మన్మథుఁడనంగ విబుధుల ♦ మానసములు
కలఁత నొందించునట్టి ట ♦ క్కరివినీవు
తోడఁబుట్టువు లనికూడ ♦ దోఁప కలదె
అసమశౌర్యధురీణ యో ♦ కుసుమబాణ. 8

చ. సకలజనాళికెంతయునుసౌఖ్యముఁగూర్చెడుమాధవాఖ్యచేఁ
బ్రకటితమాచుసొంపెసఁగి ♦ పల్మరుదుర్మద వృత్తిఁబూని మ
మ్మకట వసంత సీవిటుల ♦ నారడిఁబెట్టకు పేరుఁగొన్న దిం
డుకొ ఘృతకోశమంచనుచు దూరుదు రెల్లరునిన్ను నెంతయున్

సీ. పలుమారునాపైకిఁ ♦ బరుగు లెత్తెదవేల
పవనుఁడా నినుఁబట్టి ♦ పాముమ్రింగ
మాటికి ననుఁజేరి ♦ మాటలాడెదవేమి
చిలుక నిన్బంధించి ♦ చిక్కు పఱుప
కన్ను లెఱ్ఱగఁజేసి ♦ కళుకూకలిడెదేమి
పికమ నిన్గాకులు ♦ బిట్టదల్ప

చలమూని ఝుంకృతుల్ ♦ సల్పెదవదియేమి
తుమ్మెదా నీమేను ♦ దుమ్ముగాను
తే-గీ. పంచపాతకులని మిమ్ముఁ ♦ బలుకవలయు
నట్టు కాకున్న నబలల ♦ బిట్టలంచు
బుద్ధిమీకేలఁగలుగు దు ♦ ర్బుద్ధులార
ఎగ్గొనర్చితిమే మీకు ♦ నెన్నఁడైన. 10

వ. ఇక్కెక్కువడి నక్కామినీతిలకంబు శరచ్చంద్రి మందాని
లేందిరానందన శుక పిక బృందంబులం దూలనాడి యాసుంద
ర హర్మ్యతలంబున శయనింప నొల్లక యందునిదిరించు నెచ్చె
లుల హెచ్చరింపక మందమంద గమనంబున. 11

సీ. తురుమందు దురిమిన ♦ విరులదండలుజార
పలుమరు విసువుచేఁ ♦ బారవైచి
పసిడిచెఱంగుల ♦ పైవల్లెవాటును
వలదంచు విరిపాన్పు ♦ పైని వైచి
ముచ్చటల్ చెప్పఁగా ♦ వచ్చురాచిల్కను
వలదుపొమ్మనుచు న ♦ వ్వలనుదఱిమి
కాళ్ళవేళ్ళఁ బెనంగి ♦ కలసిరా గమకించు
నంచపిండుల నద ♦ లించివైచి
తే-గీ. పసిడిపావాలుదొడిగిన ♦ భారమనుచు
అల్ల నల్లన సౌధంబు ♦ నతివడిగ్గి

ఉస్సురుస్సు రటంచు ని ♦ ట్టూర్పులిడుచు
పూవుఁ దోఁటకుఁబోయె నా ♦ పూవుఁబోఁడి. 12

వ. ఇవ్విధంబున నవ్వరారోహ యుద్యానవనంబు సొచ్చి యందుమాధవీలతా నికుంజంబునం దానుదాచి యుంచిన రాజకుమారుని చిత్రఫలకంబుఁ జేతనంది యాతని సౌందర్యంబుఁ బలుమా రుపలక్షించి. 13

ఉ. శారదపూర్ణిమద్యుతి దిశల్ రమణీయముగాఁగ నిండుటల్
గోరువలు న్శుకంబులును ♦ గోగ్రహళాహళిగాఁగఁగూయుటల్
మారుఁడు సాయకంబులను ♦ మాటికి నేయఁగ నోర్వ లేకయ
వ్వారిజగంధి యేడ్చెఁ బిక ♦ వాణి నిగేరుకలస్వనంబునన్. 14

ఉ. హా వసుధేశపుత్రి హృదయంబున నక్కటికంబు లేక నన్
భావజుఁ డుద్ధతుండగుచుఁ ♦ బల్మరుబాణము వేయసాగినన్
గావఁగఁ దల్లిదండ్రులును ♦ గల్గినబంధులు జూడరైరి నే
నేవగ నోర్తునింకఁ దెఱ ♦ వెయ్యది ప్రాణము నిల్పు వల్లభా. 15

వ. అని విరహార్తయై పలవించుచున్న సమయంబున నొక్క కాపాలికుండు కాళికాదేవికి బలియొసంగుటకునై యుత్తమరాజకన్య నొక్కదాని నన్వేషించుచు నాటిదినంబు శోభావతీపురంబు సేరి యందు కన్యాంతఃపుర సమీపోపవనంబున రాజపుత్రి చెచ్చెలులం గూడి సాయంతనవిహారంబులు సల్పుచుండుటం గాంచి దానిం గొనిపోవుతలంపున నచ్చట నొరులెఱుంగకుండునట్లు ప్రచ్ఛన్నంబుగా నుండి సమయంబు నిరీక్షించుచున్న యెడ రాజ

పుత్రికంఠంబు విననగుటయు నయ్యింతి యేకతంబ వనంబున నుండుట యెఱింగి సంతసించి. 16

క. చిక్కెను బళిరే నేటికి
చక్కనిరాసుత యటంచు ♦ సంతసమున నా
ముక్కిడికాపాలికుఁ డా
చక్కనిపూఁదోఁటఁ జేరి ♦ జనవరపుత్రిన్. 17

క. డాయంజని భీతిలు నా
తోయజముఖి నెత్తికొనుచు ♦ దోర్బల లీలన్.
బోయె నోరు లెఱుఁగకుండఁగ
మాయావర్తనుఁ డరణ్య ♦ మార్గముల దెసన్ 18

తే-గీ. వానిఁగాంచునంత ♦ వసుధేశనందన
పుడమిమీఁదఁ ద్రెళ్ళి ♦ పడియె భీతి
అంతఁ గొంతవడికి ♦ నాముగ్ధ మూర్ఛను
దెలసి నాల్గుదెసలఁ ♦ గలయఁ జూడ. 19

సీ. తనపురోభాగంబు ♦ నను భయంకరమూర్తి
యయినట్టి కాళిక ♦ యాలయంబు
మద్యభాండంబులు ♦ మాంసంపు రాసులు
పదను బెట్టిన పెద్ద ♦ బారుకత్తి
వీభూతికుంకుమల్ ♦ వెలయ మోములఁ దాల్చి
శక్తిఁబూజించు పా ♦ షండకులము
రక్తవస్త్రంబులు ♦ రక్తమాల్యంబులు
రక్తాక్షతలు కూటి ♦ రాసు లొకట

తే-గీ. జూడ హేయంబుఁగల్గించు । పోడుములును
కలిగి తనచుట్టుఁ గావలి । కాయుచుండు
నట్టిపాషండవనితల । నతివగాంచి
తన్నుఁ గాళికి బలిసీయఁ । దలఁచి రనుచు. 20

చ. అఖిలధరావనీశ మకుటాగ్రమణు ల్దనపాదపీఠికన్
బ్రికటితలీల వన్నెలిడ । భాసుర ధర్మపథానువర్తియై
యొకరికి హానిసేయని గు । ణోన్నతుఁడౌ నరనాథుగర్భమున్
దకటజనించి ఘోరముగ । నంతమునొందఁగనైతి దైవమా.

సీ. పదిమాసములుమోసి । బహుకష్టమునను న
న్బడయుమాయమ్మ యెం । తడలునోకొ
పొత్తుకూర్చుండక । భుజియింపకుండు నా
కన్నయ్య మదినెంత । కలఁగునోకొ
నేనెప్రాణంబుగా । నెంచునానేస్తంపు
టింతులేమంచు శో । కింతురోకొ
కన్నమ్మకన్నను । గడుబ్రేమమున నన్ను
బెంచు దాదియునుశో । కించునోకొ

ఆ-వె. పండులేనొసంగ । కుండిన దిననొల్ల
కుండునట్టి చిలుక । పిండు లెట్లు
కలఁతనొందునోకొ । కటకటా ననుఁగూర్చి
యెంద ఱెన్నివెతల । నొందవలసె. 22

చ. కటకట నన్నులాంగనగఁ గైకొని సర్వసుఖంబులందుచున్
పటుతర వైభవోన్నతుల । భాసిలనెంచు మదీయ వల్లభున్

డెటులసహించువాఁడొ మది నెన్నివిధంబులఁ దాపమొందునో
కుటిలవిధాత మమ్మకట । కూర్పక యిట్లొనరించె దైవమా.

వ. అని యిట్లనేకవిధంబులఁ బనవిపనవి దుఃఖించి ప్రాణరక్షణంబున కెద్దియుఁ దోవకానక తనప్రత్యక్షదైవంబగు శ్రీమహాలక్ష్మిని హృదయకమలంబున సన్నిధానంబుఁగావించుకొని.

ఉ. తల్లిరో నీవరంబున ను । దార గుణాతిశయంబులొప్పి రం
జిల్లెడు రత్నగర్భునకు । శ్రీయను సద్గుణ శీల పుంజముల్
గొల్లగఁగల్గుగాత్రమికిఁ । గోర్కెలునించెదు పట్టివౌచు హా
యిల్లును బాసి కారడవి । నిట్టులు మ్రింపఁగనైతి శ్రీసతీ. 25

ఉ. నీవలన న్విధాతయును । నీరజనాభుఁడు ఫాలనేత్రుఁడున్
భూవలయంబుసర్వమును బూన్కి సృజింపఁగ బెంప నొంపఁగా
దేవవిభుండు స్వర్గమును । దేకువ నేల సమర్థులౌట నో
దేవి ప్రసన్నవౌచు నరు । దెమ్మననుంగరుణింప భార్గవీ 26

చ. సిరులిడి రక్షణన్సలుప । శ్రీరమణీమణివౌచు విశ్వలక్ష
కరుణనొసంగి వాణియనఁ । గా విలసిల్లుచు దుష్టదైత్యసం
హరణమొనర్ప దుర్గయను । నట్టి విధంబుల లోకవృత్తముల్
జరిపెదునీవు నన్నిచట । సత్కృపఁగాంచు టదెంత భార్గవీ 27

తే-గీ. అమ్మ నినువేల్పులు మహాత్మ । లైనమునులు
బ్రాహ్మణులు గొల్వలక్ష్మివై । పరగుదెపుడు
కడమవార్తలు పూజింపఁ । గాళి దుర్గ
భైరవియుఁ జండికయనంగఁ । బరగుదెపుడు. 28

చ. జననమునందుటాది మదిఁ జేకురుభక్తిని శూరసేనుఁడ
న్మనుజవరేణ్యునందనుని మాధవు నాపతిఁ జేయుమంచు నే
ననయముప్రార్థనల్ సలుప నక్కట యీగతి కాననంబులో
హాననమునొందఁజేయ మన సయ్యెనె భక్తవరప్రదాయినీ

వ. అని బహువిధంబులఁ బద్మవాసినిఁ బ్రార్థించుచున్న సమయంబున నప్పద్మినీకాంతకు శరీరం బవశంబై నిదురమత్తువలెఁ గన్నులు మూఁతవడుటయు నప్పుడు. 30

సీ. అచ్చపు బంగార మతిశయించెడిమేని
కాంతి నల్ దిక్కులఁ గలయఁ బర్వ
పరిపూర్ణ రాజ బిం బము నేలు ముద్దుమో
మందు కుంకుమరేఖ యంద మొప్ప
పునుఁగు జవాజి చం దన లేపనంబులఁ
గమ్మతావులుదిశల్ గ్రమ్ముకొనఁగ
చిన్ని కెంబెదవుల చిరునవ్వు వెన్నెలల్
తళుకు లే జెక్కులఁ దోలఁకరింప
తే-గీ. దీనులకుఁ గల్గు దుఃఖముల్ వోనడంచు
ప్రబలయౌదార్యవైభవ ప్రభలు వెలయఁ
గలుష హారిణి సకల లో కైకజనని
ఇందిరాదేవి గనుపట్టె నిందు ముఖికి. 31

వ. ఇట్లు ప్రసన్నయై యద్దేవి రాజపుత్రి శిరంబుపైఁ దన కరపల్లవంబునిచి యల్లన నిట్లనియె. 32

చ. అడలకుమోకుమారి మది ♦ నాతయినన్ గృపలేక నిన్ను కా
రడవుల నొంపఁ బూనిన దు । రాత్ముల శిక్షయొనర్తు నీవికన్
గడుముద మొప్ప నీహృదయ ♦ కాంతునిఁ బెండిలియై సుఖింతువో
పడఁతి భయంబుదక్కుమిదె ♦ భద్రము చేకురనయ్యె నీయెడన్.

వ. అని చెప్పి యద్దేవి యదృశ్యయైన నప్పద్మినియు మనంబునఁ జైతన్యంబుఁ గలుగఁ గనుదమ్ములు విచ్చి చూచు నెడ గాళికాబలి సమాప్తంబుఁ గావింపఁ దన్నుఁ గొనిపోవ నరుదెంచు పాషండులం గాంచి భయంబునఁ వడంకుచుఁ బెద్దయెలుంగున.

శా. క్రూరాచారులు దుర్మదాంధులు మహా । క్రూరల్ ననున్ శక్తికిం
ఘోరంబౌ విపినంబులో బలియిడన్ ♦ గొన్తెచ్చి మర్దింపఁగాఁ
జేర న్వచ్చుచు నున్నవా రిచట నేఁ ♦ జేటొందఁగా నైతి హా
రా కేనాతలిదండ్రులార కరుణన్ ♦ రక్షింప రేమీ సుతన్. 35

శా. నీవే నాదగు దైవము న్గతియుఁగా ♦ నెంతేని ప్రేమంబునన్
భావంబందున నమ్మియున్న నను ని ♦ ప్పాపాత్మకుల్ శక్తికిం
జేవన్మీరఁగఁ దెచ్చి యిప్డు బలిగా ♦ సేయంగ నున్నారహో
రావే నన్గరుణింపవే రయమునన్ । రక్షింపవే మాధవా. 36

వ. అని యాకాంత యాక్రందనంబు చేయుచున్న యెడ. 37

ఉ. రాజకుమారుఁ డచ్చట ధ ♦ రావరనందన మీఁది బుద్ధిచే
సాజపు ధైర్యమున్విడచి । సారెకు మార వికారమంది యీ
రాజితవైభవంబులు వ ♦ రాననఁ గూడక యేలనంచుఁ దా
నోజఁ దలంచి చిత్తమున ♦ నోరిమిఁదక్కి కడున్ దపించుచున్.

తే-గీ. అడిగెనో లేదో వానిని య ♦ య్యతివ యుండు
పట్టణంబును జేర స ♦ ప్పద్మగంధి
ననువరింపఁగ నెంచదో ♦ నాకుమదికిఁ
దెలియకుండిన మది నెట్లు ♦ నిలుపు వాఁడ 39

వ. అనితలంచుచు వెఱ్ఱియెత్తినవాని విధంబున సకలవిభవంబులం ద్యజించి తనతల్లిదండ్రులకును దక్కినబంధుజనంబులకును దెలియనీయక తనప్రాణమిత్రుఁడగు కళాచంద్రునకు సంయిత మెఱుఁగనీయక యొక్కనాటి నిశీథిసమయంబున నొంటియై సామాన్యవేషంబున ఖడ్గమాత్రసహాయుండై శోభావతీపట్టణంబునకుం బోవు నరణ్యమార్గంబున నశ్వారోహణంబొనర్చి యరుగుచున్న యెడఁ జోరండులు రత్నగర్భనందన నాళికి న్బలియొసంగఁగమకింప నయ్యబల భీతిచే రక్షింపుఁడు రక్షింపుఁడని యార్తయై యాక్రందనంబుసల్పుచుండుట యమ్మాధవ కుమారుచెవులు సోకుటయు నతితర్వితగమనంబున నయ్యార్తరవంబు విన్నదైన దిక్కునకుంజని యందుఁ గాళికిం బలియొసంగఁ బద్మినిం గొనిపోవు చోరండులంగని సక్రోధుండై యిట్లనియె. 40

శా. ఓరీదుర్మదులార క్రూరమతులై ♦యుగ్రాటవి స్త్రీతయా
యూరాజీవ దళాయతేక్షణ నిటుల్ ♦ హింసింపఁదో దెచ్చి నా
రారండిప్పుడు పంపువాఁడమిము మా ♦ ర్తాండాత్మజున్వీటికిన్
క్రూరాచారము లంతమొంది సుఖము ♦ న్గూడంగ నీభూమికిన్.

వ. అని తనకరవాలంబు ఝళిపించుచు చోరులం డాసియద్దు

రాత్మ్మలశిరంబులు ధరాతలంబునఁ ద్రెళ్ళనేయుచున్న యప్పీ
రవరుంగాంచి హతశేషులగు పాషండులు పలాయితులగుటయు
నమ్మహీవరసుతుండు పద్మినిం డాసి తనమనంబున 42

మ. భళిరే పున్నమచందురుండనుచుఁ జె♦ప్పన్వచ్చు నెమ్మోముక
ల్వల యందంబునకన్న మిన్నయని ప ♦ ల్కంజాలుకందోయి వే
ల్పులరా నీలముల న్హసించుఁ గురులీ ♦ ప్పూఁబోఁడి కజ్జారే య
వ్వలతేఁడైన విరాళి నొందుఁగద యీ♦బాలామణిన్జూచినన్.43

తే-గీ. మునివరుం డానతిచ్చిన ♦ వనిత తక్క
యన్యసతులను సోదరు ♦ లనితలంచు
నాదు మానస మీహారి ♦ గాంచెఁ జూడ
సానురాగంబునొందెనా ♦ శ్చర్యమేమొ. 44

వ. అనితలంచుచు నమ్మోహనాంగిని డగ్గరి యిట్లనియె.

ఉ. భీతిలఁబోకు చిత్తమున ♦ భీత కురంగ విలోల నేత్రి నీ
పాతకులొంచుఁ బల్మిఁ గొని ♦ వచ్చివధింపఁగఁబూను దుర్మదో
పేతుల రూపుమాపితి దె ♦ పేర్మి సుఖంబుల నుండుమింక నో
నాతిరొ నిన్నుఁగాంచ కృప ♦ నందనవైఖరిఁదోఁచె నెంతయున్

క. వనితా నీవే భూవరు
తనయవొ మీరలువసించు ♦ తావెద్దియొ నే
వినఁ దగునేని వచింతువె
యని యనునయమున వచించు ♦ నవనీశసుతుఁ. 47

వ. కనుంగొని తనమనంబున. 48

తే-గీ. పౌర చిత్రపటంబులో ♦ నమరి యున్న
రాకుమారునిరూప వి ♦ భ్రమము లితని
యందుఁ గాన్పించుచున్నది ♦ యాతఁ డితఁడె
యితఁడె యాతండు గాకున్న ♦ యిట్టు లున్నె. 49

క. విరహముచేఁ గృశియించుచు
భరమగు తాపమున వెల్లఁ ♦ బడు నెమ్మొనున్
కరము వెతనొందు చుండెడు
వరుసయు నీరాజకొమరు ♦ వదనము తోఁచున్. 50

క. కలలోన నిందిరా సతి
వలనొప్పఁబ్రసన్నయగుచు ♦వాత్సల్యమునన్
కలకంఠి భీతినొందకు
చెలువుగ నీకిట శుభంబు ♦ చేకురు ననియెన్. 51

వ. అట్లానతిచ్చిన యద్దేవి వాక్యంబులందలంప మదీయ ప్రాణరక్షణం బొనరించిన యిువ్వీరవరుం డారాకుమారుండని తోఁచుచున్నది యని తలంచుచు గంభీరహృదయగావున తనభావంబు వెలికిఁదోఁపనీయక రాజకుమారుంగనుంగొని భయ లజ్జాసంభ్రమంబులు మనంబున ముప్పిరిగొన నల్లనల్లన నిట్లనియె.

తే-గీ. వీరవర విన్నవించెద ♦ ధారుణికిని
మధ్య భూషణమై తగి ♦ మహిత విభవ
ములనుదగి శోభవతియన ♦ నలగునదియ
మాపురంబాలకింపుము ♦ మహిత చరిత. 53

తే-గీ. ఆపురంబును బాలించు ♦ నట్టిఱేఁడు
రత్నగర్భుఁడునాఁడగు ♦ రాజవిభుఁడు
నతని కూర్మి తనూజాత ♦ నౌదు నేను
పద్మిని యటండ్రు నాపేరు ♦ భవ్యచరిత. 54

తే-గీ. మీ వియోగంబు నోర్వక ♦ మిగులవగచు
చుండుదురు నేపురంబున ♦ నుండు జనులు
అనఘచారిత్రి మీనామ ♦ మమరుకతన
యవని ధన్యతఁ గాంచె నే ♦ యక్షరములు. 55

వ. అని తన్నుఁ బ్రశ్నించిన యక్కలకంఠి వినయ గాంభీర్య భాషణంబులకును మున్ను దాపసుండు వర్ణించినదానికన్న వేయి మడుంగు లధికంబులగు నమ్మోహనాంగి సౌందర్యంబునకును మనంబున నచ్చెరువందుచు దయామయుండగు మునిచంద్రుఁడు దానుపల్కనమాటలం దప్పక నాకునుంబలె నిక్కామినీ తిలకంబునకును నాయం దనురాగం బుదయించునట్లు సంఘటించియుండనోపు నట్లుకాదేని. 56

చ. భరమగు నెండవేడిమిని ♦ బల్మరు డస్సిన పూవ్రుదీవెయ
ట్లరయఁగ నీలతాంగి సక♦లాంగకముల్ కృశియించియుండెడిదు
ర్భర మదనాస్త్రకీలలకుఁ ♦ బాల్పడి కుందిన లీలఁ జెప్ప కే
పరువడిఁ దెల్పి కన్నులకుఁ ♦ బండువు సేయుచు నున్న దెంతయుఁ.

వ. అనితలంచుచు నయ్యోల నాగంజూచి యిట్లనియె. 58

తే-గీ. అతివ వినుము మాది ♦ యమరావతి యనంగఁ
బరగు చుండునట్టి ♦ పట్టణంబు

దానినేలు జేని ♦ తనయుఁడ నాపేరు
మాధవాఖ్యఁ దనరు ♦ మధుప వేణి. 59

చ. వనితరొ దాపనేల ముని ♦ వర్యుఁడొకండుమదీయపట్టణం
బునకరుదెంచి యేమొసఁగు ♦ పూజల నంది నను న్దయామతిఁ
గనుఁగొని మాటమాటసరి ♦ గా నిను వర్ణనసల్పు టాదిగా
మనసిజుఁడేమొ నన్ను దయ ♦ మాలి తపింపఁగసాగెఁగోమలీ.

క. అన్నము నిద్రియుఁగన నో
కన్నియ యేమియు హితంబు ♦ గావు మదికి మో
హోన్నతిని మేనప్రాణము
లున్నవొ లేవోయెఱుంగ ♦ నువిదరొ నాకుఁ. 61

చ. వనరుహనేత్రి యెల్లవిభ ♦ వంబులు నిన్నవఁగూడ కేలసం
చని మనమందునందలఁచి ♦ యాత్మపురి న్విడనాడి యొంటిమై
నినుదరిశించువేడ్కమది ♦ నిండఁగ మీ పురిఁ జేర వచ్చుచో
ఘనకచ యొంటినుండునిను ♦ గన్గొనుభాగ్యముగల్గె నీయెడఁ.

క. అని తన తెఱఁగుం దెల్పిన
మనుజేశుకుమారుఁగాంచి ♦ మనమున ముదముఁ
ఘన లజ్జయు పొడమిన నా
వనజాతదళాక్షి తొట్రు ♦ పాటుదలిర్పఁ. 63

వ శిరంబువంచి యెద్దియుంబలుక నెఱుఁగక తనహృదయే
శ్వరుండు సన్నిహితుండై యుండుటయు మఱి యితరులేరును
నాప్రదేశంబున లేకుండుటయుఁ దలంచి కరంబుసిగ్గున మిగు

లఁదడఁబడుచున్న యమ్ముగుదం గనుంగొని యది తనయందు బద్ధానురాగయగుట యుపలక్షించి యక్కుమారుండు మెల్ల మెల్లన యత్తలోదరిం డాయంజని యిట్లనియె. 64

మ. తరుణీమారుఁడె కాక కూర్మి మనకుం ♦ దాంపత్యముం గూర్పఁ
గా। సరసీజాతభవుండు గూడ మదిలో ♦ సంకల్పముం జేసి యి
ట్లరయన్వేడ్కఘటించి యుండఁదగు నో యబ్జాక్షి సిగ్గొందుచు
న్మరుకాక న్మరుగేలఁజేతు విటకో ♦ మ్మానసోదయం జూడకన్.

క. పోవుదము మా పురమునకు
భావం బలరార నెల్లి ♦ బంధులలోనన్
ఈవి నినుఁ బెండ్లి యాడెద
నో వెలఁది ధరేశులెల్ల ♦ రోహో యనఁగన్. 66

వ. అనియిత్తెఱంగున నం బలుకు నక్కుమారునింగని వినయ భయ లజ్జాసంభ్రమంబులు బెనఁగొన నమ్ముగుద యిట్లనియె.

ఉ. తల్లియుఁ దండ్రియుం గురులుఁ ♦ దక్కిన బంధులుతోటి నెచ్చె
లుల్। ఎల్లరు నన్ను నీకొసఁగ ♦ నెంతయు వేడ్క నిను న్వరింపఁగా
నుల్లమునం దలంతురు గు ♦ ణోజ్వల వేఱొక రీతిఁ బోవఁగాఁ
జెల్లునె యేస్వతంత్రమును ♦ జేయఁగ సానె తలంచి చూడుమా.

తే-గీ. అనుచుఁ గన్నుల నీరొల్క ♦ నతివ మిన్న
పలుకు మాటల నాలించి ♦ పార్థివేంద్రు
సుతున కనురాగమోహంబు ♦ లతిశయిల్ల
గటిమ నాకాంత నల్లనఁ ♦ గౌఁగలించి 69

క. సుందరి మనరాకులమున
గాంధర్వ వివాహనియతి ♦ గలదని బుధు లం
దందు వచించు టెరుంగవె
సందేహము నొందనేల ♦ సరసిజ గంధీ. 70

మ. ఎలనాగా వగపేల మీాజనకునెం ♦ తేగారవంబొప్పఁగాఁ
చెలియన్జేసెద నీయుదంతమును భూ ♦ దేవోత్తముం బంపి వా
రల బేర్మి న్మనపట్టణంబునకుఁ జే ♦ ర న్జేసి యామీఁద నో
కలికీ నిన్నువివాహమాడి సుఖముల్ ♦ గాంతు న్జగంబెన్నఁగన్

క. తలవంచి యుండెదేటికి
కలికీ నీవాడనేను ♦ గ్రక్కున పురికిన్
పొలుపు దలిర్పఁగఁ బోదము
తెలవారకమున్న యరుగు ♦ దెమ్మ రయమునన్. 72

వ. అనియివ్విధంబున న్బ్రార్థించుచున్న తనహృదయేశ్వ
రుని వచనంబులకడ్డుపల్కనోల్లక యా రాకుమారునింగూడి
యరుగుదెంచుట కనుమతించుభావంబుఁ బయలుపఱచుచు
మిన్నకయున్న నయ్యన్నులమిన్న చిత్తంబెఱింగి యా రాజనంద
నుం డమ్మోహనాంగినిఁ దనహయంబుపైఁ గూరుచుండంజేసి
తానును నాసైంధవంబారోహించి వాయువేగ మనోవేగంబున
నమరావతీ పురంబుసొచ్చి యా దుపవన ప్రాసాదంబున విడిసి త
నవృత్తాంతంబును దల్లితండ్రులకుం జెప్పిపుచ్చిన వారలును దమ
కుమారుండు రాజధర్మంబగు గాంధర్వంబున నుత్తమ రాజపు

త్రినైకొనుటకుఁ బ్రిమోద మేదురితాంతరంగులై యొక్కమ
ణిమ యాందోళికారూఢులై తనకుమారుఁడు గోడలినివిడిసి
యున్న యుపవనంబున కరుదెంచు సమయంబున. 73

చ. జననియుఁదండ్రియచ్చటికిఁజయ్యనవచ్చుటఁగాంచునంతనా
జనవరనందనుండు మది ♦ సంభ్రమముప్పయభక్తులెౕతయుఁ
మనమున సందడింపఁగ న ♦ మస్కృతిఁజేసిన రాజదంపతుల్
దనయునిగాంచి ప్రేమ భరి ♦ తంబుగదీవనలీయనయ్యెడన్. 74

క. తొలకరి మించువిధంబున
నలమన్మథు రతియనంగ ♦ న ప్పత్నియుఁ
దలవంచి వారి పదముల
కెలమిని వందనమొనర్ప ♦ నెంతయుఁ బ్రీతిన్. 75

చ. రమణిరొ చందమామ కెడ ♦ రాకవెలింగెడిచంద్రికన్ సుమే
ఘములను వీడకెంతయును ♦ గాంతుల నీనెడు మించు రీతి పు
ష్పములను బాయకెల్లపుడు ♦ భాసిలుతావితెఱంగుగల్గి మా
కొమరునివీడకీవుమదిఁ ♦ గోర్కులుమీఱ సుఖంపు మెప్పొదున్.

తే-గీ. అనుచు నాశీర్వదించి య ♦ వ్వనజముఖిని
కౌఁగిటనుజేర్చి యాధరా ♦ కాంతు దేవి
గారవంబునుబ్రేమంబు ♦ గడలుకొనెడు
మనము తోడుత నిట్టుల ♦ ననియె సతికి. 77

సీ. అంచితసత్కీర్తి ♦ నతిశయిల్లుచు నెప్డు
గరిమనుండెడు రత్న ♦ గర్భునకును

వనితా శిరోమణి ♦ యన లోకమంతయు
ఖ్యాతినొందినయట్టి । గౌతమికిని
తనయవై జనియించి ♦ యెనలేని సౌందర్య
విభ్రమంబులచేత ♦ వినుతిఁ గాంచి
అఖిల విద్యాప్రౌఢి ♦ నజుని రాణి యనంగ
ధీమతు లెల్ల నుతింపఁ బఱగి.

తే-గీ. పట్టియో బాల నీవుమా । యాత్మ జాతు
కూర్మి యిల్లాలవౌట నీ ♦ కువలయమున
నమరు రాజులలో నెల్ల ♦ నధిక భాగ్య
వంతులము మేము నిక్కమో । యింతి మిన్న. 78

వ. అని యిత్తెఱంగున నద్ధరావల్లభునిదేవి తనయనుంగుంగో
డలిం గొనియాడుచు నయ్యిందువదనం దోడ్కొని యొక్కకాం
చన శిబికారూఢయై తనయంతిపురంబునకుం బ్రవేశించి యం
దా మందయానకు సకలోపచారంబులయందుం గొఱంతలేక
యూడిగంబులు సల్పఁదగిన పరిచారికల నియమించి వనవిహా
రాదులకుం దోటి రాకన్నియల నేర్పరించి యెల్లవిధంబుల మిగు
లఁ బ్రేమంబున నోషించుచుండె నంత శూరసేన మహీవరుం
డు మాధవ కుమారుం దిలకించి యిట్లనియె. 79

చ. అనయము రత్నగర్భుఁడుమహోముదమారఁగఁగన్నపుత్రికన్
గనుఁగొనఁజాల కేవిధము ♦ గా దిగులొందెనో తల్లియేగతిన్

మనమునఁబొక్కుచుండునొకొ మారకయున్న తెఱంగ దంతయు
న్ననుపవలెన్ రయంబున శు ♦ భంబెఱిఁగించుచుఁదోడదోడనన్

తే-గీ. అనుచు నీరీతిఁబల్కి-య ♦ మ్మనుజవిభుఁడు
దన యమాత్యుల రావించి ♦ తగిన రీతిఁ
గమ్మ వ్రాయించి వెస రత్న ♦ గర్భునకును
బంచె విప్రులచే నిచ్చి ♦ పటు రయమున. 81

వ. అంతశ్శోభావతీపురంబున. 82

ఉ. అంతిపురంబునన్ నృపవ♦రాత్మజఁగానక దాదులెంతయున్
వంతల నొందుచున్ ధరణి ♦ వల్లభు దేవికి విన్నవింపఁ నా
కాంతయు రత్నగర్భుఁడు న ♦ గన్ దగమూర్ఛిలిలేచికూఁతు న
త్యంతమునాత్మ నెంచి వెత ♦ హాయనుచున్వెసదుఃఖితాత్ములై.

మ. తనయా శ్రీసతిసత్కృపామహిమచే♦ తన్నిష్ఠమాగర్భమం
దున జన్మించుటఁజేసి యీజగతి నెం ♦ దున్సాటిమాకెవ్వరం
చని చిత్తంబునఁబొంగుచుండెదముమా♦ యాశాలతల్ భగ్నమై
చనఁగా నేమయిపోయితో మరలఁగాం ♦ చన్గల్గు నేనిన్నిఁకన్.

చ. పరమ దురాత్ములెవరో నిను ♦ బల్మి చెరన్గొనిపోవ భీతవై
కరుణను బ్రోవరారెనుఁ ♦ గాంచినయొతలిదండ్రులారయం
చరయఁగఁ బ్రాణరక్షణకు ♦ నై శరణంబును వేడియుందువో
వరసుత మేమిఁకన్ బ్రతుక ♦ వచ్చునెనిన్గనకున్న నీధరన్. 85

ఉ. నీవు వరించినట్టి ధర ♦ ణీవర సూనున కిచ్చి సంతసం
బావహిలం దగం బరిణ ♦ యం బొనరింపఁగ నెల్లవేళ మా

భావములం దలంచెదము ♦ పాపపుదైవము క్రూరచిత్తుఁడై
మావరపుత్రి నిన్నిటుల ♦ మాయముఁజేసె నిఁకెట్టులోర్తుమో.

తే-గీ. అనుచుఁ బెక్కువిధంబుల ♦ నవని విభుఁడు
నతనిదేవియు మిక్కిలి ♦ యడరుచుండ
సఖి కళావతి తనకూర్మి ♦ సఖిని గాన
కెంతయును మానసంబున ♦ వంతనొందె. 87

తే-గీ. హా ధరానాథపుత్రి న ♦ న్నకట యిట్టు
లొంటిగాఁ జేసి యెయ్యెడ ♦ నుంటివో క్కా-
ప్రాణపదమగు నినుఁబాసి ♦ బ్రదుకఁ గలనె
యెలమినీ తోడిదే లోక ♦ మెంచ నాకు. 88

ఉ. మానినిశూరసేనుని కు♦ మారునిఁబ్రేమ వరింపఁగోరి యా
సూనశరాంబకంబులకు ♦ సుక్రుక్కుచు నొక్క తెఱంగునుండ ని
న్నూబనికెఁగాంచి నీదువగ ♦ పుందగఁదెల్పుమటంచు నెమ్మదిన్
ఏనడుగంగ సిగ్గుగొను ♦ చెంతయు నీమనమందు కోర్కి నా
తోనయమొప్పఁగాఁబలుకు♦తొయ్యలికప్రిపుపల్కులెంచెదన్

చ. నరవరసూతిఁ గన్గొనిమ♦ నంబలరారపురంబుఁజేరి యా
కరణి వచింపఁ గారవము ♦ గా ననుబిగ్గ గవుంగలించి, నా
కరయఁగఁదల్లితండ్రియును ♦ నాప్తులు నీకెనగారటంచు నన్
బరిపరిభంగులన్బలుకు పల్కులు నామదిఁబాయ నేర్చునే. 90

ఉ. కాంతునిగూడిసౌఖ్యములఁ ♦ గాంచుచునుండెదునిన్నుఁగో
ల్పోఁగా

నెంతయు మానసంబునను । నెప్పుడలంచుచునుండునాకు నీ
వంతఘటించె దైవ మని । వార్యముగానొనగూర్చెనిట్లు నా
స్వాంతమునేగతిన్నిలుపఁ ♦ జాలుదు నిన్విడనాడి నెచ్చెలీ. 91

వ. అని యివ్విధంబున నవ్వనిత పనవిపనవి దుఃఖించి కొంతవడికి ధైర్యం బవలంబించి యెవ్విధినైన రాజపుత్రి జాడఁ దెలిసికొనవలయు నట్లుగాదేని ప్రాణంబు వీడవలయు నని కృతనిశ్చయయై యంతకు ముందుదినము తాము విహరించిన యుద్యానవనంబునకుంజొచ్చి యట రాజనందన దాఁచియుంచిన మాధవుని యాకారఫలకం బీవలఁబడవైచియుండుటయుఁ గనుంగొని యాకారణంబునఁ బద్మిని విరహావేదనం దాళలేక యొంటిమై యువ్వనంబునకు జనుదెంచియుండు. అపు డామె దయాన కెద్దియేని యొక యాపదసంభవించియుండు నని తలంచి నయ్యైతావులందిలకించుచుండ నచ్చటఁ బుష్పాడితిన్నియపైఁ బద్మిని యాసీనయైన జాడయు నచటికిం జేరిన యొకస్థూలకాయుఁడగు పురుషుని యడుగులజాడయు, నవ్వలఁ బువ్వుదోఁటనుండి మహారణ్యంబునకుంబోవు నాపురుషుని యడుగులజాడఁ దిలకించి యెవ్వఁడో యొకపాపకర్ముం డీయబల నపహరించి యెత్తికొనిపోయి యుండనోపు నని నిశ్చయించి యమ్మంచుబోఁడి యొకవీరపురుషవేషంబు ధరియించి యుత్తమాశ్వంబు నధిరోహించి యొక్క కరవాలంబుఁ జేతంబూని యాపురుషుని యడుగుజాడ ననుసరించి పోయిపోయి, మహారణ్యమధ్యంబునం దొక చండికాలయంబును

మహాశక్తికిం జేయు పూజోపకరణంబులును శిరంబులు ఖండింపంబడి ధరాతలంబునంబడి మృతులైన పాషండశవంబులను గనుంగొని యత్యాశ్చర్య సంతాపంబులు బెనంగొనం గొంతవడి యోచించి యీ పాషండులు రాజపుత్రిం దమచండికకుం బలియొసంగం గొనితెచ్చియుండ నెవ్వరో మహామహుని యనుగ్రహంబున వీరలు వధింపంబడినట్లు తోంచుచున్నయది, ఇంక నయ్యింతిజాడం గనుంగొనవలయు నని తలంచి, యిటునటుంబరికించుచుండ నందొక పాదపంబు సమీపంబున నొకయుత్తమసతీతిలకంబు నిలచినజాడయును దానిసమీపంబున హలకులిశ ధ్వజాది రేఖచే నొప్పు నొక పాంచాలపురుష పుంగవుని పాదంబుల జాడయు దృశ్యంబులయిన నయ్యింతి మనంబునం గడుంగడు సంతసించుచు నెవ్వరోయొక యుత్తమపురుషవరుండు మా నెచ్చెలికిం బ్రాణదానంబొనరించి భయంబువాపిన చందంబీస్థలంబునం బొడకట్టుచున్నయది యని నిశ్చయించి మఱియు నటం నట బరిశీలింప నాసమీపంబున నొకయుత్తమాశ్వంబు నిలచిన యడుగులును దానియందకుంజనిన స్త్రీ పురుషుల పాదచిహ్నంబులును వెనుక నాసైంధవరాజంబు పాదంబుల జాడదక్క వారిజాడలు గనుపింపకుండుటయుం బరామర్శించి యీకాంతయు నావీరవరుండును హయారూఢులై యొందేనియరిగియుందురని తలంచి, యాహయశ్వంబు జాడననుసరించి తనహయంబునుంబోనిచ్చుచుండ నాజాడయచటి కనతిదూరంబునను

న్న యమరావతీ పురంబునకుం జనునట్లు నూహించి యప్ప
ట్టణ సమీపంబుననున్న జనపద ప్రాంతంబులందిరుగు కొంద
ఱమనుజులంగని యీదేశంబునఁగల విశేషంబులెవ్వి యని యడి
గిన వారా వీరవేషంబుననున్న యాకాంతంగని భయభక్తులుమ
నంబున సందడింప నోయయ్య యీదేశంబునేలు శూరసేన
మహీపాలుని తనయుండగు మాధవరాజకుమారుం డొకయు
త్తమరాజపుత్రికి బ్రాణరక్షణబొనరించి మొన్న మొన్నతత్ప
ట్టణంబునకుందోడ్తెచ్చి వివాహంబాడుప్రయత్నంబుననున్నవాఁ
డింతియ యిచ్చటివిశేషంబు”లని వారువిన్నవింపనాకళావతియుఁ
దనయనుంగునెచ్చెలి తప్పకమాధవకుమారునిచేతఁబ్రాణరక్ష
ణంబు వడయుట నిక్కంబని త్వరితగమనంబునఁ దనయశ్వరా
జంబుఁ బరుగువారించుగొనుచు శోభావతీపురంబునుం బ్రవేశిం
చి యందొరు లెఱుంగకుండఁ దనపురుష వేషంబూడ్చి యెప్ప
టియట్ల రాజమందిరంబునంజొచ్చి పుత్రికావియోగంబుచే దుర
పిల్లు రాజదంపతులంజేరి ధైర్యవచనంబుల నిట్లనియె. 92

తే-గీ. అమ్మ మీరిట్లు శోకము । నంద నేల
స్వప్నమున లక్ష్మినాకుఁ బ్ర ♦ సన్నయగుచు
పద్మినియు సుఖంబున్నది ♦ ప్రాణ విభుని
బడసి యాశుభవార్తయ । వచ్చుమీకు. 93

తే-గీ. అనుచు విన్నవించి । యాదేవి యంతర్హి
తంబునొందె నిఁక శు । భంబు గల్గుఁ

గాన తగినవారిఁ ♦ గలదేశములకంపి
యతివ క్షేమవార్త ♦ నరయ వలయు. 94

చ. అనియిటుధైర్యవాక్యముల♦నాడుకళావతిఁజూచిదేవియుఁగా
జనవరుఁడు న్మనంబులను ♦ జెందిన దుఃఖము గొంతపాసి యో
వనిత మదీయ పుత్రి ముఖ ♦ వారిజ మీ జగతీ తలంబునఁగా
గనుగొనునట్టి భాగ్య మిఁకఁ ♦ గల్గునె దైవము మేలుసేయునే.

తే.గీ. అమ్మ కన్నను దక్కిన ♦ యాప్తజనుల
కన్న నాకుఁ గవళాతి ♦ మిన్నయనుచు
ననయము వచించు చుండు మా ♦ యమ్మనిన్ను
విడిచి యేరీతి నొంటిదై ♦ యడలు నొక్కొ. 96

వ. అని తనయనుంగుకూఁతుం దలఁచి తలఁచి కన్నీరునించు గౌతమీ రత్న గర్భలంగని యాకళావతి పద్మిని క్షేమంబిఁకఁ గొలఁది దినంబులలోన మనకుఁ దెలియంగల దనియూరడించె. మంత్రులు పద్మాన్వేషణంబునకు నెల్లదిక్కులకు జారుల నంపి తిమని శూరసేన భూవరుఁడు పనిపిన విప్రవరులు శోభావతిం జేరి ద్వారరక్షకులచే నను జ్ఞాతులై రాజసభ బ్రవేశించి దీవించి శుభలేఖల రాజపుంగవుచే నొసంగిన నాతండును గైకొని గౌరవంబెసఁగఁ గన్నులనద్దికొని యమాత్యునిచే నిడ నతం డాలేఖ నిట్లుచదివె. 97

సీ. శ్రీమదఖండ సు♦శ్రీ యుక్తులును మహా
రాజశేఖరులును ♦ రాజమాన్య

రాజపూజితులైన ♦ రత్నగర్భావనీ
నాథునకును వంద ♦ నములొనర్చి
అమరావతీ పట్ట ♦ ణాధినాథుఁడు శూర
సేనుఁడు భక్తి నొ ♦ త్తేని వ్రాసి
కొనిన విన్నపములు ♦ మనుజేశ యిందుల
క్షేమంబు లచట మీ ♦ క్షేమములను
తే-గీ. దెలుపఁ బ్రార్థించువాఁడ న ♦ వ్వలి తెఱంగు
మనవిచేసెద మీ కూర్మి ♦ తనయ యైన
పద్మినీ సతి క్షేమంబుఁ ♦ బడసి యిచట
మాగృహంబున నున్నది ♦ మది చెలంగ. 98

వ. దానికిం గారణంబు విన్నవించెద. 99

క. ధణీశ మీకుమారిక
తిరముగఁ బూదోఁటనుండఁ ♦ దిలకించి వడిన్
దురితాత్ముఁడొకఁడు కాళికిఁ
బరువునఁ గొనిచనియె నపుడు ♦ బలియొసఁగంగన్. 100

ఆ. వె. దానిఁగాంచి పద్మ ♦ తన మానసంబునఁ
గడు భయంబునొంది ♦ యడలి మిగుల
నన్నుఁ బ్రోవుఁ డనుచు ♦ నాతియాక్రందన
మాచరించె దీన ♦ యగుచు మిగుల. 101

తే-గీ. అట్టివేళకు సరిగ నా ♦ యాత్మజాతుఁ
డైన మాధవుఁ డాత్రోవ ♦ నరుగనయ్యె

నప్పు డాకాంత రోదన । మాలకించి
పరుగుననుబోయి మీసుతఁ ♦ బట్టియున్న. 102

క. వారింబోరిగొని మీసుతఁ
నోరడిలంజేసి యందు ♦ నుండు క్షణమునఁ
వారికి ననురాగంబులు
ధారాళముగాఁగఁ బొడమె । దైవ నియుక్తిఁ. 103

తే-గీ. ఉత్తమ వివాహములలోన ♦ నుత్తమంబు
నైనగాంధర్వ నియతి మీ । యాత్మజయును
మా సుతుండును బ్రేమించి । మనము లలర
నొకరొకరు కూర్మి మెలఁగుచు ♦ నున్నవారు.104

వ. కావున ప్రజోత్పత్తి సం॥ ర॥ మాఘశుక్లదశమి గురువాసరంబున శుభలగ్నమందు మదీయపుత్రుండగు చిరంజీవి మాధవ కుమారునకును భవదీయాత్మ జాతయగు చిరంజీవియు సౌభాగ్యవతియు నగు పద్మినీ సతికిని బరిణయ వైభవములు జరుగునుగాన మీరును సతీసుతమిత్రామాత్య బంధువర్గంబులతోడ మదీయ పురంబునకు విచ్చేసి భవదీయపుత్రికా జామాతల నాశీర్వదించి నన్నానంద భరితుంజేయవేఁడెద. ఇట్లు భవదీయ బాంధవ్యం బభిలషించు శూరసేన మహీవరుం డనివ్రాసియుండు శుభలేఖ నాకర్ణించి రత్నగర్భుఁడావార్తగోత్రమిా కళావతులకుం జెప్పి పుచ్చిన వారలును మిగులసంతసించిరి. ఇట ధీమంతుఁడు తేనింగనియిట్లనియె. 105

తే-గీ. తగిన బాంధవ్య మిద్దియే ♦ ధారుణీశ
మాననీయులు మీరును ♦ వారుఁగూడ
గరిమ వెలిగారమునకు జం ♦ గారు పోదుగు
టయ్యె మీరును వారును ♦ వియ్యమంద. 106

క. జామాత నెంచి చూడఁగ
ధీమతి సౌందర్యయుతుఁడు ♦ ధీర వరుండున్
భూమీశ మీయదృష్టము
నేమని కొనియాడనేర్తు ♦ నెంతయుజగతిన్. 107

తే-గీ. తనయకును గూర్మియల్లున ♦ కును బ్రియంబు
మీఱ నరణంబులనుగొంచు ♦ మిన్నగాను
మున్న నమరావతీపురం ♦ బునకు నేడ్క-
లలరఁబోవంగఁ దగు వివా ♦ హంబునకును. 108

చ. అని తగురీతిమంత్రివరుఁ ♦ డాడినమాటలునాలకించి య
మ్మనుజకులాధిపుండు దన ♦ మానసమందుననుత్సహించుచున్
దనయను గూర్మియల్లుని ము ♦ దం బలర న్గననాత్మనెంచి దా
ఘనతరవైభవంబెసఁగఁ ♦ గా నమరావతికి న్బ్రయాణమై. 109

క. చనవలయునంచుఁ దన పరి
జనులకునాజ్ఞలనొసంగి ♦ జననాథుఁడు నె
మ్మనమలర శూరసేనుం
డనిపినభూసురులఁగాంచి ♦ యతివినయమునన్. 110

వ. జాంబూనదాంబరాభరణాదులం బూజించినతీహిత పురో
హితా మాత్యబంధువర్గంబులతోడ నమరావతికింజనియె నట.

తే-గీ. కనక సౌధాగ్రములఁ జంద్ర ♦ కావిజెక్కె-
ములను దగనిల్పి కస్తూరి ♦ కలయ నలికి
గరిమవీథులఁ బన్నీరు ♦ కలయఁజల్లి
పొలుపుగాముత్తియముల ము ♦ గ్గులనునిలిపి. 112

క. మేలుచుగరాలగోడల
నోలింజిత్రములవ్రాసి ♦ యొగిపచ్చలు ము
త్యాలుం గూర్చిన తోరణ
జాలంబులుగట్టి రథిక ♦ సంభ్రమ మొప్పన్. 113

తే-గీ. వాకిళులముందు కదళికల్ ♦ వరుసనిలిపి
వెలయ పుష్పసరంబుల ♦ వ్రేలఁగట్టి
గుమ్మములఁజందనంబును ♦ గుంకుమయును
సరవిఁ బూజించి కలశముల్ ♦ జల్లి వేడ్క-. 114

సీ. ఏవంకఁ జూచిన । నెలమి వీణావేణు తాళమృదంగాది।
ధ్వనులు చెలఁగె। ఏచా యఁదిలకింప ।హేలావతీ మనోహర
కంఠనాద సు । స్వరము లెఁగె। ఏజాడఁ బోయిన । నెంతయు
వందిమాగధుల కైవారంబు । గ్రిందుకొనియె। ఏవైపు గన్గొన।
నింతుల సంతతకోలాహలధ్వ ని।లోలి వెలసె॥ తే-గీ. ఎచటఁ
బరికింప నాట లెం । దెందుఁగనఁగ। సాము గరిడీలుహాస్య ప్రి।
సంగములును। గలిగి వర్ణింప శక్యము । గానియట్టి । వైభవం
బున నప్పురి । వరలుచుండె. 115

వ. అంత రత్నగర్భుండు నమరావతిండాసి యందు పురబా
హ్యోపవనంబునవిడిసి తనరాక చారులచేఁ జెప్పిపుచ్చిన. 116

క. వియ్యపు వారల రాకను
జయ్యనవిని శూరసేన ♦ జననాథుండున్
నెయ్యమునఁ బ్రీతి గదురఁగ
నయ్యెడ జని రెల్లవార ♦ లతివిభవములన్. 117

ఆ-వె. అరిగి రత్నగర్భ ♦ ధరణీశునకు భక్తి
వందనంబు సలుప ♦ డెంద మలర
రత్నగర్భుఁ డపుడు ♦ రహి శూరసేనుని
గౌఁగలించి ప్రీతి ♦ గదుర ననియె. 118

క. నాపూర్వ పుణ్యవశమున
భూపకులశ్రేష్ఠ నీవు ♦ పుత్త్రినకుఁడగన్
నాపట్టి నీయఁ గలిగితి
నేపున నాదగు నదృష్ట ♦ మేమని తలఁతున్. 119

ఉ. మీసుతురూపశౌర్యముల ♦ మించిజనుల్గొనియాడవించు నే
నాసుతనిచ్చిపెండిలి యొ ♦ నర్ప మదిం దలఁపోయుచుండఁగా
భాసురలీలమీసుతుఁడె ♦ భద్రముఁగూర్చిమదీయపుత్త్రిఁ దా
నాసవరించె దానికి మ ♦ హాముదమందితి రాజశేఖరా. 120

వ. అని తనవియ్యంబునకుఁ గడుంగడు సంతసించు రత్నగర్భునింగొనియాడుచు గౌతమీదేవిని మిగుల గౌరవించి వారి నొక మణిమయ శిబికారూఢులం జేసి తనపురంబునకుం గొనిచని దివ్యసౌధరాజంబును వారికి విడిదిగానొసంగి యందు వారలకుం బరిచర్యలొనర్పఁదగు పరివారంబు నియమించి తానచ్చట రత్నగర్భునితో నిష్టాలాపంబులనుండె నవసరంబున. 121

తే-గీ. తోటివారలఁ గూర్చి సం ♦ తోష మొప్ప
నాడుచుండెడు శూరసే ♦ నాత్మజుండు
రత్నగర్భుని రాక సం ♦ భ్రమ మెలర్ప
వినిరయంబునఁ జనుదెంచి ♦ వినయమొప్ప. 122

వ. నమస్కరించి నిలచియున్న యల్లునిదీవించి యిట్లనియె.

ఉ. అల్లవసంతునిం ధనదు ♦ నాత్మజుని న్సురరాజసూనునిన్
ఉల్లసమాడు రూపమున ♦ నున్నతి మీఱి సురేశ కోటిలో
నెల్ల భుజాబలంబెసఁగ ♦ నెంతయుఁ బేర్వడి నట్టి నీవు మా
కల్లుఁడ వౌటనామదిమ♦హాముదమందెఁ గుమార యెంతయున్. 

వ. ఇట్లల్లుని న్బహూకరించు సమయంబున. 125

తే-గీ. శూరసేను మహీశుని ♦ సుదతి యైన
యట్టిమణిమాలికాదేవి ♦ యతిముదమున
పద్మినిమనుదాను మణిమయ ♦ భవ్యశిబిక
నెక్కి యచ్చోటి కరుదెంచి ♦ యెలమితోడ. 126

తే-గీ. వచ్చి రత్నగర్భు ♦ వసుధేశుపత్నిని
గాంచిగలింప నామె ♦ కడుముదమున
శూరసేనుసతిని ♦ జూచి ప్రియంబగు
నట్టి భాషణముల ♦ నిట్లు లనియె. 127

క. మీవియ్యంబున నీ జగ
తీవర పుంగవులలోనఁ ♦ దిలకింపఁగ నో
దేవి కడు ధన్యులము మే
మీవటకొనరించు పుణ్య ♦ మేమనఁ గలమే. 128

వ. అనిగౌతమీదేవి మణిమాలికాదేవినిం గొనియాడు నెడ

క. జననీజనకులఁగన్గొని
మనమలరఁగఁ బద్మతాన ♦ మస్కృతిఁజేయన్
గనివారల మానసమున
ఘనమగుప్రేమంబు ముదము ♦ గడలుకొనంగన్. 130

చ. అనుఁగుకుమారిమాకుముదమందఁగనీవుజనించుకల్మియీ
ఘనుఁడగుశూరసేనుఁడుద♦గన్ దగువియ్యమునెయ్యమాచుదా
ననయము సఖ్యత న్మెలగు ♦ నంతటి భాగ్యము గల్గెగాన మా
జననము లింక సార్థకము♦చంద్రనిభానన యీ జగంబునన్. 131

వ. అనితమసంతోషాతిశయంబులు వెల్లిగొల్పు నెడమహీవరుండు పద్మినీ మాధవులకు వివాహ వైభవంబులన్గురుప నాజ్ఞాపించిన.

చ. మగువలు సంతసంబొలయ ♦ మాధవుని న్దగఁబద్మినీసతిన్
సొగసగు హేమపీఠమున ♦ సొంపుగ నిల్పి సుగంధ తైలము
న్దగ సిరసంటి చందనపు ♦ నల్గులువెట్టియు స్నానమార్చి వా
రొగిని సుగంధధూపములనొయ్యనసేసి రయంబుమీఱఁగన్.

ఉ. చానయొకర్తుమేల్మిసిమి ♦ చాయలనొప్పెడిపట్టువల్వలన్
మానవనాథ చంద్రుని కు ♦ మారునకు న్దగనీయ నాతఁడెం
తేనయమొప్ప నవ్వలువ ♦ నెంతయు వేడ్కధరించె మానినీ
మానహరుం డితండనుచు ♦ మానినులెల్లరు నెంచిచూడఁగన్.

తే-గీ. వారిజానన యొక్కతె ♦ ధారుణీశ
నందనునకును దగఁగుంద ♦ నంపు గద్దె

వెలయఁగాఁ దెచ్చి యట నిల్పి ♦ వేడ్కమీఱ
నతనిఁగూర్చుండనియమించె ♦ నతిముదమున. 134

సీ. నగుమొగంబునఁగీరు ♦ నామంబు నొకలేమ
సొగసు గుల్కెడురీతిఁ ♦ దగ నమర్చె
తరుణీమణియొకర్తు ♦ విరజాజి విరిసరుల్
రాసుతు సిగకు నే ♦ ర్పలరఁ జుట్టె
బోటిమిన్నయొకర్తు ♦ కాటుకచుక్కను
నీటుగాఁ జెక్కిట ♦ నిల్పియలరె
నవరత్నమయభూష ♦ ణంబులొక్క లతాంగి
పొంకముమీఱ న ♦ లంకరించె
కుసుమగంధియొకర్తు ♦ పసమీరఁ బరిమళ
చందనంబును మేని ♦ యందునలఁదె

తే-గీ. చానయొక్కతె కేల విం ♦ జామరంబు
నంది యల్లనవీచె నా ♦ హాయసంగ
తన్వియొక్కతె నిల్వు ట ♦ ద్దంబుఁదెచ్చి
రాజసుతు ముందరనునిల్పెఁ ♦ దేజమలర. 135

తే-గీ. పద్మినీసతి కంతటఁ ♦ బణతియొకతె
వలిపెచెంగావి వెలిపట్టు ♦ వల్వఁగట్టి
గరిమసరిగంచు ఆవిక వే ♦ డ్కలరఁదొడిగి
వెంట్రుకలనార్చి కీల్గంటు ♦ వైచిమఱియు. 136

క. కనకాసనమునఁ బద్మిని
ననువుగఁగూర్చుండనిచ్చి ♦ యతివయొకతె యా

వనజాక్షికిఁ దిలకంబిడె
నసువున జలజమునవ్రాలు♦ నళియో యనఁగన్. 137

చ. కమలదళాక్షి నేత్రములఁ♦గజ్జలమొక్క లతాంగిదిద్దెఁ సొం
పమరఁగఁజాదనంబు నొక ♦ యన్నులమిన్న యలందెఁ బాదప
ద్మములను నెరయుంబసుపు మానినియొక్కతె నేర్పసంగఁగా
నమరిచె భూషణావళుల ♦ నంగనయొక్కతె వెట్టె నెమ్మదిన్.

చ. కాటుకచుక్కపెట్టెనొక ♦ కామినిపద్మిని చెక్కులందుఁబ
ల్నీటు చెలంగఁ బూసరుల ♦ నిండుగ రాసుత కీలుగంటునన్
వాటముగాఁగఁ జుట్టె నొక ♦ వారిజలోచన నిల్వుటద్దమున్
దేఁటపడంగ నొక్కచెలి ♦ తెచ్చి రయంబుననిల్పె ముందటన్.

క. మంగళవాద్యము లంతట
రంగుగమ్రోయించిరధిక ♦ రాజితగతి వా
రాంగనలు నాట్యములు హృద
యంగమముగ సల్పిరందు ♦ నతి చాతురితోన్. 140

వ. అప్పుడు భూదేవోత్తముల యనుమతిని మాధవుండు శూరసేన రత్నగర్భాదిగురువర్గంబును బురోహితామాత్య బంధుమిత్రవర్గంబు పరివేష్టించియుండ మణిమయస్తంభ విభ్రాజమానంబును గారుత్మత మౌక్తికశృంగార తోరణ మండితంబును, మనోహర సాలభంజిక పరివృతంబును, సుగంధ కుసుమ మాలికాలంకృతంబును, మరకత గోమేధిక పుష్యరాగనిర్మిత సోపానశోభితంబును, వీణావేణు మృదంగ తాళాది మనోహ

రారాన సమ్మర్దితంబు, వార విలాసినీ నాట్య విభ్రమంబునగు దివ్యమండప మధ్యంబున రత్నఖచిత పీఠంబుపై నాసీనుండయ్యె

క. గౌరీ కళ్యాణంబులు
వారక భూదేవపుణ్య ♦ వనితలు ముదమొ
ప్పారఁగఁ బాడుచు నంతటఁ
గూరిమి రాసుతునిపజ్జ ♦ కు న్వేడ్కమెయిన్. 142

వ. పద్మినిం దెచ్చి కూర్చుండఁబెట్టె. 143

ఉ. మంగళవాద్యముల్ చెలఁగ♦మాటికి భూసుర వేదఘోషలు
ప్పొంగ సువాసినీజనులు ♦ పొల్పుగ దీవనలీయ వేడ్క వా
రాంగన లాడ భూజనము ♦ లందఱు సంతసమంద నర్మిలిన్
మంగళసూత్రమా నృపకు మారుఁడుగట్టె శుభాంగి కెంతయున్

క. భూసురు లక్షతలం గొని
భాసురముగ వేదములను ♦ బఠియించుచు నా
రాసుతునకుఁ బద్మినికిన్
ఆ సన్నాసిస్సులొసఁగి ♦ రతిమోదమునన్. 145

వ. ఇట్లాశీర్వదించిన భూసురపుంగవులను విప్రసువాసినులఁ జందన కుసుమ సువర్ణ తాంబూలాదులం బూజించి యవ్వల శూరసేన రత్న గర్భాది గురుజనంబుల మణిమాలికాది సతీమణులసేవించి దీవనలంది యున్న యెడ 146

క. అన్నము సూపము ఘృతము
న్బన్నుగఁ బచ్చళ్ళు మంచి ♦ పరమాన్నంబున్

మిన్నయగు నూరగాయలు
గ్రొన్ననచిత్రాన్నములును ♦ గమ్మనిచారుల్. 147

క. అప్పడములు వడియంబులు
తెప్పలుగా నిడ్డెనలును ♦ దేనెతోలల్ వె
న్నప్పంబు లతిరసంబులు
నొప్పగులడ్వములు గారె ♦ లొగిహోళిగలున్. 148

క. చక్కెరయుఁ గదళిఫలములు
మక్కువతో ద్రాక్షమంచి ♦ మామిడిపండ్లన్
జక్కని మీఁగడ పెరుగులు
తక్కగసాపడిరి బుధ వి ♦ తానముతోడన్. 149

తే. పఱగనీరీతిఁ బువ్వంపు ♦ బంతులైన
యంత కరములుగడిగి మ ♦ హాముదమున
కప్పురపు వీడెములనంది ♦ కౌతుకమున
నుండునంతటిలోన భా ♦ నుండుఁగ్రుంకె. 150

తే-గీ. విరులు సిగఁజుట్టి నామంబు ♦ వేడ్కదిద్ది
పులుఁగుజవ్వాజి గంధము ♦ ల్గలయఁబూసి
సరిగ వలువలు ధరియించి ♦ మరుని గేరు
రూపవైభవములచేత ♦ రూఢిఁ దనరి. 151

సీ. బంగరు మయమైన ♦ పట్టెమంచము దోమతెర చాం
దినీ పట్టు ♦ పరుపు మంచి। జలతారు తలగడ ♦ ల్జాలపూసర
ములు మణిరత్న దీప కం ♦ బళముపట్టి। వేళ్ళవీవనయును

వెలయు తాంబూలంపు పళ్ళెరంబు జవాది ♦ బరిణ యగరు ।
ధూపముల్ వీణియ ♦ తులలేనిగందంపు గిన్నెయుఁ బన్నీరు ♦
కీలుచెంబు ॥ తే-గీ. నిలువు టద్దంబులును చిత్ర ♦ ములును
ఖండ । శర్కరయు క్షీరమును ఫల ♦ సముదయంబు । లమరు
పడకింటఁ దలిదండ్రు ♦ లనుమతమున । రాజపుత్రుండు మది
గోర్కె ♦ లలరనుండె. 152

సీ. సంపెఁగనూనెచే ♦ నింపుగాఁ దలదువ్వి ♦ జడ
వైచివిరిసరుల్ జాలఁజుట్టి। కూరిమి వెలిపట్టు ♦ చీరఁగట్టఁగనిచ్చి।
యాకుపచ్చని పట్టు ♦ రైకఁదొడిగి । పునుఁగుఁజవాజిచం ♦
దనలేపనమొనర్చి। నవరత్న మయభూష ♦ ణములఁదొడిగి ।
ముద్దుమోమునతిలక ♦ మునుదిద్ది సీటువాల్ । గనులందుఁ గా
టుక ♦ నునిచివేడ్క॥ తే-గీ. నగరు సాంబ్రాణిధూపంబు ♦
లతివమేని । యందుఁ దగఁబట్టి కొన్నిర ♦ హస్యములను ।
దగినరీతిని జెప్పి య ♦ త్తరుణి నపుడు । పడకటింటికిఁ గొని తె
చ్చి ♦ పణతు లెల్ల. 153

వ. కవాటంబులు బంధించిపోవనున్నయెడఁ బద్మినిప్రాణ
సఖియగు కళావతి రాజపుత్రుండాసి రహస్యంబుగా నిట్లనియె.

తే-గీ. మానవేశకుమార యీ ♦ మగువ మిగుల
ముగుద మీ మదికెక్కు నే ♦ ర్పునమెలంగఁ
జాల దటుగాన కూర్మి ర ♦ సజ్ఞురాలి
గా నొనర్చిసుఖింపుఁడు ♦ గడుముదమున. 155

వ. అని పద్మినింగని మెల్లగా నిట్లనియె. 156

క. అతివా కడుసుకుమారుం 157
డతిరసికుఁడు నీవిభుండు * నటుగావున నీ
వతి నేర్పుకల్మి నాతని
మతి రంజిలఁజేసి కూర్మి * మన్ననఁ గనుమీ. 158

వ. అని చెప్పి కళావతి తలుపులు మూసికొనిచనిన. 159

క. ధరణీవర సూనుం డా
తరుణిని డాయంగనరిగి * తగునేర్పు మేయిన్
సరసంపు భాషణంబుల
సరసిజముఖి లజ్జవాపి * సంతస మొప్పన్. 160

చ. కరములఁజాపి కూర్మిబిగికౌఁగిటఁ జేరిచి మోవినొక్కుచున్
సరసిజపత్త్రనేత్రి బిగి * చన్నుల పైక సడల్చి యల్లనన్
కరములనంటి చెక్కులఁ * గాటము ప్రేమనుముద్దువెట్టుచున్
గురులనుజక్కదిద్ది యళి*కుంతలి కిట్లనిపల్కె నెమ్మదిన్. 161

తే-గీ. అతివ నీవాడఁగానె ని * త్యంబు మదిని
నిన్నుఁగూడఁగఁ దలఁచుచు * నున్న నాకు
దైవ మతి సత్కృపామతి * భావమలర
నిన్ను దేవినిగాఁజేసె * నన్నుమిన్న. 162

చ. అనియిటుపల్కుచు న్జలరుహాయతనేత్రిని బాన్పుఁజేరఁగా
జనువునఁదెచ్చి వేడ్కలర * జందసముందగఁజూసి వీడెమున్
మనమలరంగ నిచ్చి పలు * మారులు బిగ్గ కౌఁగలించుచున్
మనసిజకేళిఁదేలె బలు * మాదిరులన్ సతి తోడ వేడుకన్. 163

వ. ఇట్లు పరిపూర్ణమనోరథులై యప్పద్మినీ మాధవులు గలసి మెలసి సంతసంబులనున్న సమయంబున వేకువయై ప్రభాత మంగళ వాద్యంబులు మ్రోగుటయు. 164

తే-గీ. చిక్కువడి యున్నకురులను ◊ జక్కదిద్ది
వలువసవరించి హారముల్ ◊ వరుసఁజక్క
నునిచి మోమునతిలకంబు ◊ ననువుగాను
దిద్దికౌఁగిటఁగదియించి ◊ ముద్దుగొనుచు. 165

ఆ-వె. ఉన్నప్రాణనాథు ◊ నువిద సిగ్గునశిరం
బల్లవంచి పడక ◊ టిల్లు వాయ
నాజ్ఞవేఁడనాతఁ ◊ డతివఁగౌఁగిటఁగ్రుచ్చి
రమణి యల్లపోయి ◊ ర మ్మటన్న. 166

చ. బడలినమేనితోఁ బెదవి ◊ పైయలరారెడు పంటిగంటుతో
సడలిన దైకతో విరులు ◊ జారిన క్రీడెడ సోయగంబుతో
కడు రవళించు మెట్టియలు ◊ గమ్మనిగందపు మేనితావితో
పడక గృహంబు వెల్వడియె ◊ భామినిమారుని దంతియోయనన్.

వ. ఇట్లు కేళికాసౌధంబువాసి చనుదెంచు పద్మినీమణికిసఖీజనంబులుపన్నీట జలకంబార్చి చెంగావివలువఁగట్టి కస్తూరీతిలకంబిడి సర్వాభరణంబుల గైసేసియున్నఁగొందఱుచెలులు రాజకుమారునకుజలకంబార్చి చలువధోవతులంగట్టనిచ్చి నామంబుఁదీర్చిరి యెల్లయుతదనంతరం బాదంపతులంగూడి రాజబంధుగులును వారి తలిదండ్రులును బంచభక్ష్యంబులతోడ సాపడి మహదానందంబున నున్నయెడ గౌతమీరత్నగర్భులు శూర్పసేనమణిమాలికా

దేవులచే గౌరవింపంబడి వారలవీడ్కొని కూఁతునకునల్లునకు ననంఖ్యాతంబులగు నరణంబులనొసంగి పద్మినింగౌఁగలించి తగుబుద్ధులంగఱపి మాధవునకప్పగించి తమపురంబునకరుదెంచి సంతసంబున రాజ్యంబునల్పుచు సుఖంబుండిరి. అటఁబద్మినీ మాధవులు సకలసౌఖ్యంబు లనుభవించుచు నమందానందంబున నోలలాడుచుండిరని చెప్పిన నారదుంగని వాణీవల్లభుండిట్లనియె.

క. శ్రీలలరుచుండు నీకథ
నోలిం జదివినవినిన ♦ నొగి లిఖియింపన్
జాలమదికోర్కులిడి గో
పాలుఁడు రక్షించునెల్ల ♦ భంగులనవనిన్. 169

మాలినీవృత్తము. శ్రీసతీ మనోవిహార ♦ సింధుమేరుధీర గో
భూసురాది సాధుపాల ♦ భూరిగోత్రధార శ్రీ
వాసవాది దేవవంద్య ♦ భక్తబృందహాని హ్రా
ద్వాస దైత్యనాశ కృష్ణ ♦ వాసుదేవ కేశవా. 170

గద్య:-ఇది శ్రీమదనగోపాల వరప్రసాదాసాదిత సరస కవితా శోభిత శ్రీమధ్భాష్యకారాచార్య కరుణాకటాక్షులబ్ధ పంచ సంస్కార పవిత్రిత శ్రీమత్పర్ణశాలవంశ పయఃపారావార రాకాసుధాకర కౌండిన్యసగోత్రపవిత్ర శ్రీరాఘవార్యా పత్య అలమేలుమంగాగర్భజనిత శ్రీచిల్కపాటి వేంకట నరసింహార్యకళత్ర సీతాంబాప్రణీతంబగుపద్మినీపరిణ
 [illegible]శ్వాసము సంపూర్ణము.